శ్రీరస్తు.

# మాంధాత్ర చరిత్రము

## యక్షగానము.



వెస్టువార్డు అండు కంపెని,

చాకలపేట పోస్టు, మదరాసు.

1953 0—6—0

శ్రీ ర స్తు.

# మాంధాతచరిత్రము యక్షగానము.



క. శ్రీసీతపతిభవార్చిత, వాసవనుత శేషశయన వారిజనయనా
భాసురవరభద్రాచల, వాసా నిను బ్రస్తుతింతు వైకుంఠేశా.

ఉ. శ్రీగిరిజాత్మజుండు సురసేవ్యపదాంచితుఁ డేకదంతుఁడుఁ
నాగముఖుండు విఘ్నపతి నాకపురాధిప వంద్యుఁడుఁ మహా
భోగపతీంద్ర సూత్రుఁడు ప్రభూతజగత్రయ రక్షణాత్ముఁడుఁ
నాగ విభూషణుండు గణనాథు డభీష్టము లిచ్చు వేడుకన్.

ఉ. వాణివిరించిరాణి శుకవాణి సరస్వతిదేవి వేగ గీ
ర్వాణి మృదూక్తసూనటుల వాక్కునసీవును నిల్పి షట్కృపా
బాణి నుతింతునిన్ను సురభూజమటంచును నమ్మినట్టిపద్
వేణిసరోజనేత్ర బహువేడ్క శుభంబుల నీయవేగదే.

ఉ. వ్యాస వసిష్ఠ కౌత్సశుక భార్గవనారద శౌనకాదులన్
వాసిగ పూర్వభూపతుల వద్దకవీంద్రుల కాళిదాసులన్
భూసురవర్యులన్ విబుధబృందములన్ వినుతింతు శ్రీహరిక్యాద
దాసుడ పాపయార్యులకు ధారుణిలక్ష్మణరాయ సూనుఁడన్.

గణయతిప్రాస లక్షణము గాంచగలేదు సమస్తశాస్త్రముల్
గుణనిధులైన కావ్యలను గూడి పఠింపగలేదు సర్వముఁ
ఫణిపతిశాయి సత్కృపను భాగవతంబున నుండుచర్య ధీ
మణిపురుషోద్భవుండు మహిమాంధాత కథామృతంబునన్.

రంభా పూర్వాశుల రాకడ.

క. శ్రీపద్మాధిప హారసఖ, పాపౌఘవినాశ శౌరి భావజజనకా
గోపతివాహనయతినుత, దాపును శ్రీరాములంచు దలచెద మిపుడున్.

అటతాళం. రంభా పూర్వాశులను చంద్రాననా రాజీవాక్షులును—
అంబరమునసుర కదంబమునుగాంచగ అంబుజముల పాటలాటలు సలి—
పెడి—. అతిరూపులింపొందగా చూచినవార లాశ్చర్యమును జెందగ—

మతిమంతులగు విప్రతతి పుణ్యాజనముల క్షితినాథులకు మోహితులను చేసేటి—౨. నాకీమణులగేరు చక్రవాకనాథుని రుచిమీరు - కీరవాణిరో మేము ధారుణియందున వారిజవైరిని గేరుమోములుగల్గు—౩. ధర భద్రాచలనివాసుడూ మమ్మేలిన తపనకులాధీశుడు- తరుణిరో వినవే శ్రీకర మూగ భిదురముధరియించె వారసభలో చరియించువారము రంభా పూర్వశులాము.

క. యెవరమ్మ మీరుచెలువలు, కవగూడియు యిందురాను కారణమేమి,
సవినయముగ జెప్పుడియీ, భువిలోపల మీరలుండు పురమును పేరుల్.

## ద్విపద.

వినవమ్మశుకవాణి వినుముఅలివేణి, కనవమ్మ మాచక్కదనముపూబోణి
మాయూరుమాపేరు మావర్ణములును, భావజచిలుకనే పరగవినిపింత
నాకనివాసంబు రాకేందుముఖుడు, పాకశాసనుడు సురపతిమాకురాజు
రంభపూర్వశులము రాజీవనేత్రి, అంభోరుహాక్షుని ఆత్మలోదలచి
అతిమోదమునవిప్రతతిపుణ్యజనుల, నుతిగరగించేటి చతురులమమ్మా.

ఆదితాళం. చతురస్త్రీలమమ్మ మేము వోచంద్రముఖీ—చతు. చతురతతో సురపతిచెంగట మేమతిముదమున పాటలుసలిపెటి—చ. సారసనేత్రి వినవేకోమ్మా దుష్కృతులపొందు జేరము గాంచనేత్రు మమ్మ - వారిజసంభవ వందితచరణము లాహాఘిగ యెపుడాత్మలో దల చేటి—చ. నాకనివాసము వినవమ్మ మమ్మేలేదోర పాకశాసనుడ ముద్దుగుమ్మ - జోకతో యీ ముల్లోకములందున ప్రాకటముగ మృగ పాటలుబాడేటి—చతు. వరభద్రగిరి నివాసుడమ్మ లక్ష్మణదాసునికరుణతో బ్రోచెను వినవమ్మ- పురుముదమున మేమరుగాగ మదిలో నిరతము దలచే సరసిజనేత్రిరో—చతు.

క. రంభాంబుజాక్షి యందురు, కుంభినిలో జనులునన్ను కువలయనేత్రీ
జంభారియెదుట నాట్యము, సంబరమునచేసెదాను సతతము నేనుఁ.

## ఊర్వశి వాక్యం.

క. మదగజయానావినగదె, ముదముతో జంభారిచెంత ముదితరో నేనుఁ
మృదువైనపాటబాడెద, సదయాధ్యుడు సంతసించి సంరక్షించుఁ.

ఆటతాళం. వినవమ్మ చెలియా సుందరులాము వినుపింతు తెలియా- కనవమ్మ మాచక్కదనము కెవ్వరుసాటి వనితలుగలర- మేదిని యందు గంధూవ- ౧. న్యాయవర్జితులా పొందుగోర మేయెడ మదిలారా-యంచగ మనరో కాయజు దుర్స్మరణచేయుచు ముదమున పోయెద మిపుడు- శ్రీ. సిరి మనోహరుడు భద్రగిరీశు డురగారిధ్వజుడు - దురితాకూపారము నరికి సుస్థిరముగ ధరణీలక్ష్మణదాసవరుని బోషించెను.

విమలాంగిదేవి ప్రవేశము.



క. శ్రీకమలాధిపహారసఖ, కాకోదరితల్పశౌరి ఖగరాడ్వాహా రాకేందుభానులోచన, శ్రీకరిభద్రాద్రిధామ శ్రీరఘురామా.

అటతాళం. శ్రీరమేశా శ్రితజనపోష చిద్విలాస వైకుంఠేశా- ధారుణి కలుషవినాశ భూరిజనపోష- శ్రీ. నారదాసంగీతలోలా నీరజాక్షవిజయ- పాలకనకచేల సింధుదయాళు సద్ధర్మశీల - శ్రీ. శంబరారి జనకాజంభారి శత్రుమస్తక సమతిసంహారి - అంబుజోద్భవవినుత విశ్వంభరహారిమహాను భావ చంద్రసూర్యనేత్ర భద్రాద్రిమందిర యిందీవరాక్ష వందితామర బృంద గంధర్వవర మానిరక్ష- శ్రీరమేశా.

చెలికత్తియలు ప్రవేశము.

గీ. అమ్మవినవమ్మ దొరసాని అందముగను, సభల నున్నట్టి జన ములు సంతసించ, సమ్మతంబున తెరవెళ్ళెసరసిజాక్షి, మీదుచరితంబు విన మాకు మోదమాయె.

గీ. చెలియవినవమ్మ మాంధాత చరితమిపుడు, లక్ష్మణాఖ్యుడు రచి యించె రమ్యముగను, కరుణతోడుత భద్రాద్రితరణికులుడు, సకలసంపద లిచ్చునే సన్నుతాంగి.

అటతాళం. భామానే భూపాలుని లేమానె భామానే సజ్జనస్తోమ ముమెచ్చగాభామినిజనములనీమహిమ వెలసిన - భా. కొమ్మనేపుత్తడి బొమ్మనే కొమ్మనే ముద్దులగుమ్మనె వోచెలి యిమ్మహీశునకు సమ్మతి గలిగిన-భా. మేటినే చంద్రికతేటనే మేటినేను చెలులతోటి సుఖించెద సాటియెవ్వరునాకు పాటలగంధిరో-భా. కలికినేచిలుకలకొలికినే కలికి నేను యీకాశ్యపి శ్రీభద్రశైల నికేతనుని స్థిరముగనమ్మిన-భామా.

ద్విపద.

విరిబోణినీకునే వినిపించెదాను, కరుణతోనీకథ కమలాయతాక్షి
మిత్రవంశముమాది ధాత్రిలో వెలసె, పుత్రులుగలరమ్మ పూబోణినాకు
అంబరీషుండును అగ్రనందనుడు, కుంభినిలో ముచుకుందుడనెవాడు
చిన్నకుమారుండు చిగురాకుబోణి, విమలమౌనాపేరు విమలాంగియంద్రు
మమతగలనావిభుడుమాంధాతసుమ్మి, భువిలోనయయోధ్యాపురనివాసంబు
యువనాశ్వుడు మామామ పూబోణివినవె.

ఆదితాళం. ఓకమలముఖి మాంధాతభూధవుడు రాయంచగమన-లోక వశీకరు డేకచక్రముగ ప్రాకటముగ భూపాలనచేసిన-వో. మండితకిరీటుం డమరిభుజోద్దండుడు మార్తాండకుంజుడు మండి ఖండితశత్రుడాఖండల విభవము నుండువేడ్క-భూమండల మందున-వో. రాజులలోమేటిస్ఫుటకిరీటమురమణీయగాత్రి-రా. కోటికోటిశతకోటులుదాటులుహాటకరథకరి ఘోటకములుగల-వో. పురుషునకుదయించిచాల భూరియశము నొందినరాజు ధర నరికల్పక తరువు సరిధరసుర సన్నుత సుందరుడు సుధీరుడు-వో. ముదితరో యిటువంటివాడు ముదమునశ్రీకర వరభద్రకుధరవాసు పదపద్మకోద్భవము లు వదలకనిరతముమదిలోదలచెటి.

చెలికత్తియ వాక్యం.

గీ. పురుషునకు యెట్లు నీభర్తబుట్టెసుమ్మి, స్త్రీల కుదయింతురిల యందు చిరుతలెల్ల, చిత్రమీమాటశీఘ్రంబె జెప్పవమ్మ, సంశయంబాయె నామదికి సరసిజాక్షి.

విమలాంగివాక్యం.

గీ. మగువవినవమ్మ యువనాశ్వ మనుజవరుడు, వేటమార్గంబుతో, బోయి వేగిరమున, ఘోరమృగముల ద్రుంచియు వీరుడపుడు, దప్పి గొని చాల మనము తాళలేక.

జుల్వతాళం. వినవేగదెల్పుడిపుడు ఘనముదంబుతోడను వి. వనితరో వరమునివసిష్టవనము కేగుదెంచెను-విన. మునివరేణ్యు డమర

స్త్రీలకును తా మంత్రజలము సుమమును కమండలముననుంచె జనవరుండు ద్రావెను-విన. మంత్రజలము ద్రావితి యంతకార్యమాయెను. వింతలాయె ననుచు రాక చింతనొంద కనియెను-విన. మునివసిష్టు డపుడుబలికె మనుజ శేనితోడను జనుము వేగపురముకనిన జవము దప్పివచ్చెను-విన. ధరణి భవ్య కుధరవాసు కరుణ యెట్టులనుచు పరమభక్తితోడ లక్ష్మీవరుని స్మరణజేసెను-విన.

గీ. గర్భమాయెను రాజుకు కలికి యపుడు, కొలువుకూటంబునకు రాగ గృహములోన, చింతచేయుచు నుండగ చిత్రముగను, పొట్టదిగజారి మాంధాత బుట్టెనపుడు.

గీ. వసుధసాధుడు మూర్ఛిల్లె పచ్చిమాని, మంత్ర అక్షంతులును వేయమరియు లేచె, మగువ బాలుని జననకర్మంబుదీర్చె, గొప్పవాడయ్యె మాంధాత మెప్పుగాను.

కందార్థములు.

కలకంఠివిన వెధరపతి, వలనొప్పనొక్కనాడు వసుమతిలోసన్, చలు వలధిప జతగనుగొని, పలికెను సనుమించవీడు బలుడానితాను-రౌద్రము తోను- నలనారివిను యిలభేరి చాటువులుగల- యెలుకనుబట్టి యిలపైని గొల్తునే విపుడానివేవేగ-బలుడా.

ధరగిరివణకగబలమును, హరిదశ్వునిపైస విడిచెనతికోపమునన్, కిరి యాస ఘూళిగప్పిన, హరిదశ్వునిగానలేక నురుమోదమునను- అదిరెను యంచు నరనాయకుడును-అరిగెస్వర్గపురాది వీరపురందరునితో- దురము జేసియు జిష్ణుపురము గెల్తునటంచు-నురు.

దేశాధిపతులు గూడియు, వాసవుడును యెదురుగాను వచ్చెను యపుడున్, భూషణవంశజుడోడను, వాసవుడును బల్కెనెటుల వసుధాత లేంద్రా- యీబలముతో వరగుణసాంద్ర - రసికుడచనె లేదారాజ్యంబునకు నీవు - విశదాముగను దెల్పువించు వినులనింప-వసుధా.

సురపతియిట్టులబల్కన, తరణికులుండపుడు బల్కె త్వరితంబుగను, సురబడయుడ నీతోనె, దురమును చేసెదనటంచు నరుదెంచితిని-సేనతో మిమ్మందరిగాంచితిని- దురముజేసియు నీదుపురముగెల్చిక నాడు-పురము చేరనుబోదు పురహూత వినవయ్య-అరుదెంచితిని.

చంద్రాయుధమును వేగమే, యింద్రుండు తాద్రిప్పగానె వినుఖడ్గహస్తా, జేంద్రుడు దీసెనపుడు నుర, గేంద్రుండు తా భుగులు జెందె చంద్రవదనరో-

ఆసమయాన కుందరదనరో- చంద్రశేఖరు డురగేంద్రభూషణుడు తానంది వాహనమెక్కి- అందముగవచ్చె-చంద్రవదనరో.

చందనగంధిరో పశుపతి, మాంధాతకు వరమియిచ్చె మరియెట్ల నినా, స్కందవిజయ పురందరునితో, పోరువలదు రవివంశకులజా-విను నామనవి చెవినొగ్గి తేజా- భువిలోన భద్రాద్రిపుండరీకాక్షుడు- నగుణోగ్ర రక్షించు తల్లుమయోధ్యకు- రవివంశకులజా.

వ. నీకే ఆపదవచ్చినపుడు నిన్నాదరించెదనని యిరువురు సమ్మతించి ఈశ్వరుడు కైలాసంబున కరిగెనంత.

అటతాళం. భానువంశలేమా వోచెలియ-భాను. భానువంశులే ప్రాకాశమానులె - మానిని వినుసన్మార్గ వినుతులగు - భాను. ధరసు రసన్నుత నరవరసేవిత- నరహరిచందనసురధరధీరులగు - భాను. చందురు ముఖి రాకేందుమించిన - సుందరమోము మందముగల్గిన - భాను. కరి వైరికైవడి నురమునవైరుల- ధరబరిమార్చెడు బిరుదువహించిన - భాను. చక్కనివారె సంవరజాక్షిరో-నిక్కముభద్రగిరి నిలయునిసమ్మిన- భాను.

సుమంతుడను ప్రధానిరాకడ.



క. శ్రీమంతుడుమాంధాత, మహీమత్స్యేంద్రునకు నేను మంత్రిని ఘనుడక్, ధీమంతుడనంగరజిత, భీముడ సుమంతుడను నాపేరికవినరా.

అటతాళము. మతిమంతుడను మంత్రివీరునీ మహిలోన మేరుధ ఋడా - సతతముభూతలపతి యాజ్ఞచేకొని పృధివిపాలింతు నృపతులంతమె చ్చాగ-మతి. అష్టమంత్రులలోన సృష్టిని బహుస్పష్టముగల మంత్రిశ్రే

ష్టుని-యిష్టార్థవ్రుక్తి దృష్టుడనుచుబహు దుష్టధీహాతప్రత్యా దిష్టుడనగ వెలయు-మతి. మేటియయోధ్యపురీశునిగొల్తు కోటిభాస్కర సుప్రకాశుని-సాటియెవ్వరు మహారాట్సుధీమణి సూటిగస్ఫోట నేర్పాటించి చేసెద-మతి. వరభద్రకుధరానివాసుని స్మరియింతు శ్రీహృదయేశుని - ధరమతిమంతుడ ధురంధరుడ నేచతురుడ స్థిరముగ నేనుమిల్ భరితూడ- విన.

చ. తరుణికులుండు మోదమున ధారుణియేలును రాజితంబుగన్,
అరమరలేదు అప్సరలు నాడగపాడగ దేవితోడుతన్,
వరగుణశీలుడున్ పరమవైభవ మొప్పగి నిందుశీఘ్రముమున్,
నరవగుడేగుదెంచె నానందముతోడుత వారిద్వారకా.

మాంధాత మహారాజురాకడ.

శా. శ్రీకాకుస్థ కులేశ భక్తవరదా సీతామనోనాయకా, రాకా సోమ విభాకరాక్ష అచ్యుతా రాజీవనేత్రేక్షణా, లోకేశార్చిత దానవారి త్రిదశా లోలాశ్రితౌఘస్తుతా, శ్రీకంఠార్చిత భద్రశైలధామా సేవింతు నిన్నెప్పుడున్.

ఆదితాళం. పార్థివుడేతెంచెను ధీయుతుడు శుభ్రాంశు దీధితిమించెను-అర్థి జనాళి సత్కీర్తింప స్ఫుటముభూభర్త శ్రీయర్థ సమర్థుడానుచు మెచ్చ- పా. గుటుదిటరణజిష్ణుడు వికుర్వాణ స్ఫుటభాషవర్ధిష్ణుడు- పటు బాహుబలుడు సద్భటకోటి నుతియించ పటహ తమ్మటభేరిపటు నిర్ఘోషము గాగ- పా. అంభోజసంభవనేత్రుడు జ్వలశాంత కుంభకోమలగాత్రుడు-రంభ వూర్వశిమేన కాంబుజాక్షులునటన సంబరంబొనటుల సలుపు చుండగ వేడ్క - పా. వరభద్రకుధరేశుని సంతసమున స్మరియించు మదిలోబూని-స్మరణమాతాధిపుపాద సరసీజముల భక్తి మరువక స్థిరముగ మర్త్యుల పాలించు-పా.

ద్వారపాలకుని వాక్యము.

క. రాజాధి రాజమీరలు, తేజంబుతో తెరనువెళ్ళి ధీవరవేగన్, భూజనపోషకమీరిక, రాజాతియె యేదిపేరో యెరిగించరయా.

క. ఆరీతిగ నేనిపుడు, కూరిమితో తెరనువెళ్ళి కోరినవెల్లన్, కారుణ్యముతో జెప్పెద, ధారుణిమాచరితమెల్ల ద్వారకావినరా.

అటతాళం. రాజు మాంధాతరాజు- భ్రాజకీర్తి విభ్రాజిత మొప్పగ- భూజనులకు కల్పభూజము సరియను-రా. ధీరా అహితసంహారా- వీరుడం

చిత కూరిమితోడుత - భూరిలో నయోధ్యాపురము పాలించేటి - రాజా. సుగుణనిధానా- మానకభద్రగిరి మందిరుపదములు-మానసమందున పూని ధ్యానించేటి-రా.

ద్విపద.

వినుద్వారపాలక వినిపించెదాను, ఘనబాహు బలుడు ధారుణీ యందునంద్రు, వాసియగు కోసలదేశంబునందు, భాసురముగ నయోధ్యా పట్టణముమాది, మాపురి సుందరము మరిజెప్పెదాను, శ్రీపతికరుణతో చిత్రంబుగలదు, వనములుబావులు వర్ణించతరమ, కనకమేడలుచాల గలవు గోపురములు, గోవులమందలు కోట్లగణితంబు, దేవాలయంబులు దేదీప్య మూలు, దండనాధులుగలరు తరమౌనచెప్ప, పుడమిలో మాంధాత భూపాలుడనురా.

ఆదితాళం.

భానువంశాబ్ధి చంద్రుడవినర వోరోరిద్వారకా మానవేంద్రుడ మాంధాత్రుడనుర-భూనభోంతరంబులు బెగడొందగ దానవారులయేను జయించిన-భా. హాటకాంచిత చేలుడాను వినరదివ్య కిరీటరంజితహారుడాను సాటిలేరు యెచ్చోటరాటులిక పాటల గంధులతోటి సుఖించేటి- పురుషోద్భవుండనే సుస్థిరము ముద్ధరితుడనయి కరుణచే బ్రోతయోధ్యాపురము ధళధీరుడ సంగరజితభీముడ సురుచిర సంపత్కరముగల్గిన రణరంగమందు శత్రులతోడ గర్జించియు నేను కడగియుద్ధము చేసినవాడ ధణధణ భేరిధ్వనులు చెలంగగ క్షణములోనరిపు గణముల ద్రుంచిన-భా. ధరణిలోగల్గు రాజులతోను బలవంతముగాను అరి అప్పనములు గొంటురనేను యిరవుగ భద్రగిరీశు పదంబులు మరువక నిరతముమనుజుల బ్రోచేటి-భాను.

సీ. శ్రీకరంబుగ సిరులచే వెలసిన మన్నె
వారి కొండాపురం వసుధయందు

పాలించు ప్రజల సత్ప్రభువను జోగడా
యునకు యిరువురుగలరు తనయులాఖ్య

లును తెల్పెదను సుదర్శనరాయు డనుబాల
కృష్ణరాయుడు బుద్ధి కుశలమతులు

గనిరాయభట్టు లక్ష్మణకవివర నీవు
జేయుము మాంధాత చరితమిపుడు

గీ. అనినసుకవుల పెద్దలనభినుతించి, పరమవైష్ణవ వరుడైన పాప యార్య, పదయుగంబులు హృదినుంచి ప్రస్ఫుటముగ, రచనజేసెను ద్వారకా రమ్యముగను.

ద్వారపాలకుని వాక్యం.

క. ధరణీశ వీరలెవ్వరు. పరమోదము నాయొమాకు భాస్కర కులజా, కరియానవామమిపుడు, సరగునవినిపించరయ్య సరసవిచారా.

రాజువాక్యం.

క. విమలమగు యీనానామము, విమలాంగి సధర్మశీల విలుభార్య యురా, రమణీయగాత్రి గుణమణి, పువుబోణియు నాదుభార్యసుందరి వినరా.

క. రంభాంబుజాక్షి పూర్వశి, సంబరమున ఆటపాట సలుపుదు రెపుడున్, కుంభినినాపుత్రులు వీ,డంబరీషుండు ముచుకుందు డంచురువినరా.

కుమారునివాక్యం - అటతాళం.

అంబరీషుడాను సంబరముగ వినుద్వారపాల. యీకుంభినియేలికకును పెద్దకొమరుడ ద్వారపాల. ఘనమానివసిష్ఠముని మాకాచార్యులు. ద్వా. నీకువినగచెప్పెద నేను విశదంబుతోడుత. ద్వా. శత్రులఖండించు శస్త్రవిద్యలు కొన్ని ద్వారపాల. విచిత్రముగనువచ్చు ధాత్రిపాలురుమెచ్చ. ద్వా. మది లోననిత్యంబు వదలకభక్తిచే. ద్వా. నేను ముదముతోవరభద్రకుధర వాసుని దలతు. ద్వా.

ప్రధానివాక్యం - ఆదితాళం.

ధరణీశరిపుసంహార ధరధీరాశూరా. వరసన్నుత విరిశరస్మర రూపక పరమపరాక్రమ భండనవిజయా - ధ. క్షమధన్యానుతప్రఖ్యాతవిమలాంగి నాధరమణీయ కిరీటముధరియించిన విమలగుణాంబుధి మిమునుతియించెద - ధ. యవనాశ్వరేని కుమారయవనినిను విచారకువలయలోచన భువినీభద్రా చల లలితాజ్ఞాత్ముని సన్నుతి జేసెటి-ధ.

క. సాకల్యముమీదుచరితము, మాకును వినిపించితిరి మానవనాధ, మీకెవ్వరు సాటెరాజులు, లోకములో లేరురాజశేఖరవినుమా.

రాజువాక్యం - అటతాళం.

సభజేసిమంత్రివర్యానిర్చుందామసంతోషముగను ధైర్యప్రబర్వుడని పూర్వశిరంభకామినులుపల్క-విభవమీపృధివి వల్లభులంత నుతియించ-సభ.

శృగారాంగనలు వేగ చామరములు వీవంగుచు పైబూనగ అంగరాగ బెరిమృదంగ ధ్వానములు నింగి చెలంగ శుభాంగుడానుచు మెచ్చ-సభ. భూగోళమందు క్షేమకుధరేశుని బాగుగస్మరియింతమ నాగరాజాత్మజరాట్పద సరసిజములు నమ్మి వేగవాశము వందిమాగధులును వేడ - సభ.

ప్రధాని వాక్యం - ఆదితాళం.

ధర్మసంఘటిత పీఠికారూఢుము నిర్మలహృదయుమేటి ధర్మాత్ముడని భూబక్ష్మిర్భుభాగము మెచ్చ కర్మసాక్షిసుప్రకాశ భూజన పోష-ధర్మ. ప్రకటితా భానువంశకులజదీప భూపోత్తముడవుర్వీశ నిఖిలగాయకసూక్తి వినికరము మెచ్చిరి శతమఖముఖు చేతనీవిక ధరణిపాలించు-ధర్మ. తారాల నడుమ తగు సోమునికన్న మీరినశోభయగు మీరుభూవర సాగావారి సుగుణగణధారుణి భద్రాద్రిధాముని దలచుచు-ధర్మ.

రాజు వాక్యము.

క. యేకచ్ఛత్రంబునధర, ప్రాకటముగ యేరీతిని భళిభళియనగ, నా కెవ్వరు సాటిరాజులు, లోకములో లేరుమంత్రి శేఖరవినరా.

రాజుకు మంత్రికి సంవాదం అటతాళం.





మం. విధిమాయవంటెది వినవయ్యాధరణీశ రాజశేఖర. నావిధిముందరెవ్వరు యీడేరేరయ్యా రాజశేఖర.

రా. సభలోనదానినాసాటిజేసితీవ మంత్రి శేఖర - నిను యిభముతో ద్రొక్కింతు నబలూడు అదియెంత మంత్రి శేఖర.

మం. సృష్టిలోపలనీవు కష్టముజెందేవు రాజ శేఖర - ఇూదుష్టవాక్యము లేమి నిష్టురమాడేవు రాజ శేఖర.

రా. నాకాధిపతినిప్రభాకరు గెలిచితి మంత్రి శేఖర-వోరినాకన్న అది యొకలోకములాయెనా మంత్రి శేఖర.

మం. రౌద్రమువిడుపుము రాజరాజేంద్రుడ రాజరాజ శేఖర - హేమాద్రిధీరహరి నింద్రాదులకువశమ రాజ శేఖర.

రా. ధరణిలోశ్రీభద్రగిరిస్వామి వేడ్కచే మంత్రి శేఖర- వేగకరుణతో లక్ష్మీశుని పోషించెను మంత్రి శేఖర.

గీ. కోపమొందకు నామీద భూపరత్న, వినుము ముందరవచ్చేటి విధముదెలిసి, విన్నపముచేసి వలవని విధ్వసిదూర, చిత్తమున్నట్లుగా మీరు చేయరయ్యా.

గీ. అవని నాకన్న అదియెక్కువంటివిపుడు, పట్టణములోన తుచ్ఛమని గట్టిగాను, బొమ్మగట్టించి చాలగా బొగడుకుంట, వీధివీధిన దింపుమీ వెనువబోక.

ప్రధానివాక్యము.

క. అదరక ధరపతియిపుడు, విధిపేరట బొమ్మవీధి వీధులయందుక్, ఇదినాకు తుచ్ఛమనిబల్, ముదమున దింపించె జనసమూహము లారా.

విధినాంచారి రాకడ - అటతాళము.

విధినాంచా రే తెంచెను వోజనులార విధినాంచా రే తెంచె- వీధి వీధులయందు మదగజయానలు ముదముతో జూడగా--విధి. పులుగురాడ్ వాహనుని దేవేంద్రుని నలిమలనుత నాధుని- తెలిదమ్మి గద్దియ గొలువుండురాయని శోలివోడించినది యీయిలతలమందూన—విధి. చల ముతోను దూషణచేసియు చాటించె పురిలోజాణ-నిలు వేలువరించి కొనలు చరియించగ యిలనాధునకుచేలు బలువుగా పదయాని—విధి. ఇద్దఱి బాలురను యిటుఅటుచేసి జిద్దుచె నిన్ను నేను-మద్దియేరుల క్రిందమాటుడు ననుచును యిద్దర భద్రాచ లేశునిదలచుచు—విధినాంచా.

క. మీరెవ్వరమ్మ రాకడ, పేరేమియు మాకు తెల్పు ప్రియముల రంగా, నీరూపు రేఖజూడను, కోరితిమాయమ్మ తెరను గొబ్బున వెళ్లూ.

విధినాంచారువాక్యము.

గీ. ధరణిలోపల మాంధాత చరితమిపుడు, భద్రగిరివాసు మదినమ్మి ప్రాకటముగ, లక్ష్మణాఖ్యుడు రచియించె రమ్యముగను, దానపోషుని దలచెదా దంతియానా.

ఆదితాళం. ధారుణినాపేరు విధినాంచారి యందూరమ్మ నాపేరు విధి ధీరతతోడనమ్మ దూరినవారలను వారిజనేత్రిరో లేరికకోరిన - తరుణిరో వినవమ్మమున్ను మరునిసఖుడగు బ్రహ్మవినవమ్మ హరిహారాదులాయాసము జెందగ ధరపైదింపిన వెలసియు వేడిరి—ధారుణి. పణతిరో వేడ్క వరభద్రగిరి వాసుని బల్ వేడ్క మనమున లక్ష్మణ మనుజుడు వేడగ ఘనకృపతోడను గాచిరక్షించిన— ధారు.

క. కరియాన యెందుకొరకై, యరుదెంచితివమ్మనీవు సతిమోగ మునకే, కరుణచె వీనులయందును, సరగునవినిపింపవమ్మ సరసిజనేత్రా.

విధినాంచారువాక్యం - ద్విపద.

విరిబోణినీకునే వినుపించెదాను, కరుణతో వేగంబె కమలాయతాక్షి
ఆదిత్యవంశ్యుండు అవనీశ్వరుండు, మేదినిలోపల మేటిశూరుండు
పురుమగర్భమునందు పుట్టినరాజు, ధరణిలోన యోధ్యపుర మేలుచుండు
కందర్పుబోలిన ఘనసుందరుండు, మాంధాతనామంబు మగువవినవమ్మ
మంత్రులకోపించి మమ్ముదూషించి, బొమ్మగట్టించియు బొగడించెచాలా
క్రమ్మరవిధియెంత ఘనతయనిపలికి, పంతంబుగట్టెను బాగుగావస్త్రి.

ఆదితాళము.

కరియానవినవె మోదమూన - యీసమయమందీ ధరణీశునాకు నేనుచాన - పురమువిడిచి గహ్వరముచరించను నరనాయకునకు సరగు నచేసెదా—కరి. క్షమావేల్పు వేషమూననేను రాజేంద్రునికెడకు - కమలాక్షి యిపుడుబోయెదాను రమణిరో వినుజూడుము నాడియునే క్షమ గెల్చుక వస్త్రము నొకటిచ్చెద—కరి. రాజు నొకతెరగు చేసెదాను రమణినొక తెరగునైజముగ సుతులబాపెదాను భూజనపాలుడు భూరి భద్రగిరి రాజీవాక్షుడు రాములసాక్షిగ—కరియాన.

విధిబ్రాహ్మణవేషం రాకడ - అటతాళము



నారాయణ శ్రీమన్నారాయణభగవన్ - నా. నారాయణ దివ్య నామామృతము డెందం పారాయణచేసె బ్రాహ్మణుండ నిత్యం - నా. ధాతార్చిత పరంధామ శ్రీకేశం పాతకరాక్షస ఘాతశ్రీమాధవం - నా. పీతాంబర లక్ష్మీనాథదామోదరం భూతల భద్రాద్రినాథ శ్రీరాఘవం.

క. మీరాజుదర్శనంబును, కోరియు మే మొచ్చితిమి కుతూహలముతోడన్
భూరేనితోడ తెల్పుము, ద్వారముపాలించుచుండె ద్వారక వేగన్.

ద్వారపాలకుడు రాజుతోననుట.

క. భూధవ బ్రాహ్మణు డొక్కడు, మీదర్శనమును గోరివచ్చె మోదముతోడన్, భూదేవున కాజ్ఞయేదో, మీదయితే తెలిపెదాము మేమిక రాజా.

రాజువాక్యము.

క. దండము భూసురశ్రేష్ఠుడ, దండము పదివేలునీకు ధరణిలో వృద్ధుల్, ఖండితముగ మీరిప్పుడునా, అందుకు చనుదెంచుకార్యమది తెలుపండీ.

బ్రాహ్మణవాక్యము.

క. ఐశ్వర్యాభివృద్ధియు, జయగుణగణరాజవర్య జయమును మీకున్, జయమును జయమునుగల్గును, విజయభవ మాంధాత రాజ జయమును తేజా.

సంవాదము - అటతాళం.

రా. ధరణీబృందారక వరనీవుయిచటికి వేగమానను నీవు అరుగుదెంచితివెయ్యది కార్యమునుగూర్చి బాగుగాను.

బ్రా. విధిబొమ్మగట్టిన వీరశేఖరనాతో జూదమాడు-రాజవిధి బట్లు నాపేరు వినవయ్యనిను మించెరాజులేడు.

రా. పంతమేటకెనికు బ్రాహ్మణనాతోను యింతలేదు- రాజులెంత వారు నాతోపంతమాడగలేరు తోడుగాదు.

బ్రా. ఆరుగురికి పదహారుగురికి నీవు సధికుడావు నేగ కరవాహీనుని తోడు మరము చేసిన రాజేంద్రుడవు.

రా. కరితురంగంబులు కాల్బలంబులు లేనువిప్ర నీవు-నన్ను వెఱపించె మాటలు వేడ్క-తోనిపుడు బల్కెదావు.

బ్రా. సాటిగావని నివు సంపదలిపుడు సడిగెదావు- రేడు ఘోటకకుంజరహాటకరథముల సదిగోచూడు.

రా. వేడుకతోడుత నేడు నీతో జూదమాడెదాను - భూసురులంతి నన్ను బాగడాగ హారిని నేవేడెదాను.

బ్రా. హృదయములోన యిపుర్విలో భద్రాద్రి నాయకుని నేను- ముదముతో దలచెద మదనారివంద్యుని భక్తితోను.

వ. రాజు అంతఃపురంబున కేగి భార్యయగు విమలాంగిదేవితో ననుట.

క. కలకంఠి వినవె యిప్పుడు, యిలరుభవుం డేగుదెంచి విశదము తోడన్, పలికేరుజూదంబాడను, వదలకనను నాజ్ఞయిమ్ము వారిజనేత్రా.

వాదం - అటతాళం.

ప్రాణేశ వలదుసుమ్మి క్షోణీశ మానసమున చింతమాకు దగిలె చాల-ప్రా. భామినివినవె చెలికామిని భామామణిరో ఆజ్ఞ భామిచేవున కి స్త్రీ-భా. మేలునూ బాసియుమీరు చాలనుబాలురతో కష్టపడనేను కలగంటి-ప్రా. మానిని రాజులగెల్చు రేనిని మానసమున వెరచి నేనువోడుదు వెట్ఖుల-భా. హాటకారథములాను ఘోటకా వోటుబడియు మీరు నొంటి పోగంటి - ప్రా. యేటికినీవిటులాన మాటికి కోటానకోటాను మేటిగ గెలిచిన.

భా. ధీరుడజూదమునాడి శూరుడరణ్యభూమిజేరి తిరుగవాను - ప్రా. స్వామినీ భద్రాచలధాముని నా మదియందున కోమలి నమ్మితి.

విమలాంగి వాక్యం.



ద్వి. జీవితేశ్వరవిను నావిన్నపంబు, భూవరరాజ్యంబుభూసురున కోడి, ఒంటివస్త్రంబుతో వనములుదిరుగ, వింటివరాజకలగంటినినేను, అన్న పుదకము లేకకొన్నాళ్ళుమనకు, నున్నదియీసదా మన్నించరయ్యా, పురుషుడవినునాదు పుణ్యంబుయేమొ, తఱచునరణ్యంబు దిరుగకలగంటి, కూలి చేయనుగంటి కువలాయతాక్ష, ఏలనుజూదంబు చాలించరయ్యా.

వాదం - ఆదితాళం.

ప్రాణనాయక విను హానివచ్చును మీకు మానవనాథ జూద మూమానుమీ నేడు మానవ-ప్రా. సుందరి జూదమాడ ఇందువదన కూడిన దెందుకు యిటులబలికేవు సందేహమేమెయింది - ప్రా. యెంత జెప్పినగాని కాంతుడవినవు పూని పంతమిటులాడ యెందుకు చింతమది దోచె - వద్దువద్దుయంచునీవు ముద్దియబలికెదావు వద్దుసోపోవే యిక్కడ వాదంబుయేల - వద్దు. భూపాలనన్నుచాల కోపగించెదరేల నేసోదునిల యమునకు నాపూర్వఫలమూ-ప్రా. ముదమూవ భద్రగిరి మదనజనకూని కోరి మదిలోన నేను దలచెదా మదగజగమనా.

క. కలగంటిరాజనిజమిక, వలదయ్యా జూదమాడ వలదికమీకుగ
బలువైన హానివచ్చును, యిలయేలిక నేలవయ్యా యింపుతోవినుమా.




రాజుకు మంత్రికి వాదం - అటతాళం.

ప్ర. నామనవివిను శోమహీనాయకా నేమదిదెలుసు కలనే నిజమాయె నీమదిని నెరిగుండుమిక నేనేమిసేతునుత్తగగు తెగువగక్షేమమును జూదమునుగాదు సుధీమణీ నానోము ఫలమికా.

రా. పురుష గర్భంబునందుబుట్టి శోభానూమణీ ధరణిలో నేను బిరుదుగట్టి ధరబృందారక వరునితో జూదము తరుణిరో ఆడక వెరచియుందునా-పురు.

వి. ధీయుతమతి నరరాయునకును వినజేయుమీనీవు విధిమాయ నీమంత్రివర వేయువిధముల తెల్పగను వినడాయె నేవిధమైన రాజుకు నీయెడనొకమాటచెప్పినను వేగముగనీవై వేగమే-ధీ.

ప్ర. మన్ననజేయు విధమాయెనె భూవర పన్నుగ సతి కలగన్నదినిజమను మున్ను వినుమీవన్న మాటకు నిన్ను తిన్నగ చేయవచ్చెను-పన్ను గాపదలన్ని గుడువగ నన్నుదలచేవు విన్నవించితి - మన్నన.

రా. మంత్రివర్య నాచెంతనీవు సుమాత యిట్టి శాస్త్రము లేలబల్కెదావు ఇంతిభాషలకు వింతగనాతో పంతమాలాడితే ఇంతఆగ్రహించెదా - మంత్రి.

ప్ర. మోసమువచ్చునని వాసిగ తెల్పితిని నేసవినయముగ నరేశుడ వినుమని - మో. భాసుర వరభద్రకుధర నినాసునికృపనేచేసి తేమిక భూసురుండునుగాడు విధియని యీసమయమున విన్నవించితి - మో.

వ. విమలాంగి చెలికత్తియలతో ననుట.

గీ. చెలియరో యిపుడు నేనేమి సేతునమ్మ, క్షితితలేంద్రునకును యెన్నిహితవులాను, చెప్పిననుగాని వినడమ్మ చెడుటకొఱకు, ధరణిశ్రీభద్రగిరిస్వామి కరుణయెట్లో.

క. మాతల్లి వ్యాజమొందితె, భూతలపతి వినిన సుమ్మి పుడమిలో నేడుగ, ధాత లిఖించిన ఫలమిక, యేతీరో తెలియవమ్మ యే మనుజునకున్.

వాదం - అటతాళం.

హరిసాక్షి నామాట నరరేడువినడె కరుణతో మీరైన ధరణీశు కనరే. హ. వనజాక్షి నీమాటలును - రాజువినక ఇనవంశజుడు మామనవిని వినున. మోదముతో తాను జూదమునాడ భూదేవునకు నాజ్ఞబూనెను తాళ. హ. కలకంఠి నీ పూర్వఫలమేమిసేయ నలినాసనుడు వ్రాయునది దెలియదాయ. హ. ఈ సకలంబు తానోడు శుకవాణి వేగఇకమేము విపినంబునకు బోవనాయ. హ. భాసురభద్రాద్రి వాసుండు వినవే దాసుని కృపతోడ పోషణజేసే.

రాజు భార్యతో ననుట.



క. నారీమణిరో వినగదె, ధీరుడ నీజగతిలోన దీప్తిమెరయగన్, రారాజుల గెలిచినాడను, ధారుణి ద్విజుగెల్వలేక తగునే పలుకన్.

గీ. భూతలేశ్వర నేనేమి సేతునయ్య, వలదువలదిక జూదంబు వలదుసుమ్మి, చెడుటకొరకునై దుర్బుద్ధివిడువలేవు, ధరణి శ్రీభద్రగిరిస్వామి కరుణయెట్లో.

రక్షించునట్టి వరభద్రశైలనివాసుని మరువకమదిలో స్మరణచేసెదను కరుణతోడనను గాపాడుమీయని-రా.



వ. మంత్రి సమ్మతిపఱచి రాజువిధిభట్లతో ననుట.

క. జూదంబాడుద మిప్పుడు, మేదినిసుర వృద్ధులెమ్మి మీతో మాకుఁ
మోదంబాయెను వేగమె, నేడియుగట్టెదరు మీర లెరిగించరయా.

నాదం - ఆదితాళము.

ధరణీశవినవయ్యా నురుమోదమున జూదమాడుదాము వేగ . కరిట ఘోటకంబుల కాల్బలంబుల పేరనిడుదాము. కరిఘోటకంబుల కాల్బలంబులనేను గెలచినాను విప్రవర గోబృందములను వర్ణమును గట్టదలచినాను. చారు భూషణముల దీరుడ గోవులగెలచినావు చారు తేరులాను పూరిపేర పందెంబున వేయునీవు. ఒకటా రెంట మూట నాడితిమికచాలు మోదమునను వేగ నగరము రథములయికనేను గెలిచితి తెలిపెదాను. యికనొక్కసారాడు నగధీరనాతోను బాగుగాను . నీవిసకలము నాకొచ్చె యిక యేమిగట్టేవు యేగెదాను. సకలంబు నీకోడి యొకవస్త్రంబుతో నీయెడాను నాసఖియతో సుతులతో సుఖబాసివెళ్ళి పొయ్యేదాను. నేడునాతో జూదమాడినను సంపద వోడినారు - భూగేడు భార్యా సుతులగూడి నగరివెళ్ళి అడవిజేరు. డెందములోన వసుందర భద్రాద్రియిందిరేశుని నానందముతో దలతు సుందరుడైనట్టి మందహాసుని.

వ. చెలికత్తియలు విమలాంగితో ననుట.

క. దొరసాని విధినియమనమున, దొర తెలియగ లేదుసుమ్మి తోయజనేత్రీ,
పురమునకై విడువవలసెను, సరసీరుహనేత్రనీదు భూనాథుదయన్.

విమలాంగి వాక్యము.

క. ఫుల్లాబ్జాక్షిరొ యీధర, వల్లభునకు జూదమాడ వలదనియంటిన్,
పుల్లములోన ప్రతిజ్ఞయు, జెల్లించెద ననుచుబలికె చెలియరొ వినవే.

వాదం - ఆదితాళము.

రమణిరో జూదము నేడు సుమబోణి నాడెనె రేడు శుకవాణి వోడిరెవ్వారె. యికనాకు దెల్ప మదియదరె క్షోణీశు రాజ్యమునోడె వాణీశులిఖి సమకూడె. పానీయజాక్షి విధిమాయ స్థానీయ మెడలగనాయ. రాయంచ యాన మదిలోను మాయమ్మ భేదముమాను. మతిమంతులైన ధీమణులు హితవెంతో తెల్పిరిగుణులు. కానున్న కార్యము గాక జాణరో యదాగు సుమ్మిక. ధరభద్రగిరి శ్రీరమణా కరుణించునన్నూ - మీకరుణా.

రాజు మంత్రితో ననుట.

క. విమలాంగిదేవి నిప్పుడు, క్రమముగ సూమంత మంత్రి కడు మోదమునన్, సుమభోణి శీఘ్రమిచటికి, కొమరులనిరువురిని దోడుకొని యికరమ్మా.

మంత్రి విమలాంగితో ననుట. వాదం - ఝంపతాళము.

దంతియాన పుడమిరేడు త్వరగ దోడి తెమ్మనె లెమ్మిక. దం. పంతగించి నాడువిధిని సంతసమున యింతిరో సీమంతిభూకాంతుడునిను. దం. నమ్మబోడు విధిని మదిలో సుమ్మి మంత్రిశేఖర. దం. యిమ్ముగాదు సమ్ముమంకె నెమ్మసమున నమ్మితిగా నిమ్మహీవలయమ్ము నవినుు. దం. వనజనేత్రి వినుడు రాజవరుడు యెంతజెప్పిన. దం. కనడు రాజ మహిమ నేను జనవర వినుమని ననువుగ మును దెల్పిన వినుఘనముగ. దం. యేమి సేతు సుగుణవంత భూనాథుడిటుల నేమమైతె జేసినాడు ధీమణివిన నోమినఫలమేమియొ నిక కోమలముఖ భూసురుండుగాడు మాయవేషమున వినియుతా. భూ. భాసు రాంగివచ్చెను లోకేశునిలిఖితామోహిత యికజేసెద వేమో శశిముఖి. యిందు మకుటసంస్తుత పురందరామర. యిం. వందిత హరిభద్రశైల మందిర మా యందును కృపనెందుకు లేదిందిరపతి.

ప్రధాని రాజుతో ననుట.

క. జననాయక మీయాజ్ఞచే, వనజాక్షిని దోడుకొని వచ్చితివేగఁ, వినుపించుమి రాజశేఖర, దినమణివంశాబ్ధిచంద్ర ధీవరమీరల్.

రాజు భార్యతో ననుట.

క. భామామణి విను సధర్మిణి, సోమానన పురమువిడిచి సుందరి వినవే, యీ మహిలోపల ఘనవన, భూములుచరియించ మనము బోదము చెలియా

విమలాంగి వాక్యము.

గీ. వసుధతలనాథ వినవయ్య వనముదిరుగ, బాలులెట్టుల నోర్చెదరు పార్థివేంద్ర, విధినిదూషించితిరి రాజ యిట్టులాయె, మదినితెల్పుడి విధి మాయ మానవేంద్రా.

ప్రధాని వాక్యం.

గీ. అవనినాయక మీసౌఖ్య మంతబాయె, తరుణితోఁగూడు వనభూమి దిరుగనాయె, యెట్లువోర్చెదరయ్య యీపట్లమీరు, భద్రగిరివాసుడే బ్రోచు భానుకులజా.

భానువంశోత్తమా ఓరాజేంద్రా - భా. మానవేశ్వరా నేను తెల్పినమాట నీమదిలోన నుంచక హీనవేషము దాల్చి మీరలు కానసంబుకుచేర వచ్చెనా - భా. నారిబోధింప నామెనుదూరి మేరుగిరిసమధీరా జూదము వారిజాక్షుడునాడ మీరలు భూమినోడియుకష్టమొందను చారుగర్భుడువ్రాసెనిట్టుల - భా. నందనులెట్టుల నోర్చుదురయ్య సైంధవంబులు నాగరథములు సుందరాంగుడ విల్లునస్త్రము లందమగు మణిభూషణంబులు మొందుబాయెను సుందరేశ్వరా - భా. ధరణినాయకులా గెలిచినవాడా - భా. కరుణతోడుత భద్రగిరి సిరివరుడు లక్ష్మణాగ్రజుని బ్రోచెను దురితదూరుడు మిమ్ముబ్రోచును నిరతముగ మదిస్మరణచేయుడీ..భాను.

వ. రాజు మంత్రిని సమ్మతించి భార్యయుక్తంబుగ పురంబు బయలువెడలె నప్పుడు విమలాంగి తన మనంబులో నిట్లనియె.

క. కలువల ధీవరలోచన, వలయేలిక జనకమానిని వందితశౌరీ, పులుగుల దొర వాహనహరి, వలముగిధర మమ్ముబ్రోవు వారిజనయనా.

అటతాళము.

శ్రీకాంత మనోనాయక లోకేశయాశ్వర సాయక నాకపతినుతా నీకుదయయిక లేకయుండితె మాకు ఆప్తులు లోకరక్ష విభాకరాచ్యుత సోకుమూకలహరణ మెవ్వరు-శ్రీ. సురమానివందిత పక్షిధ్వజ సరసీరుహ లోచన చతుర్భుజ దురితహరణ - అరవింద చరణమరువకను మరిస్మరణ చేయగ కరుణ కాసంతైనలేదిక కరుణసాగర తరముగాదిక. హేమాంబర మణిధర గౌరీనుత దామోదర స్మరజనకాచ్యుతస్వామి యీవనభూమిలో పలమేము బాలకు లేమిసేతుము క్షేమశైలనివాస మమ్ముల ప్రేమతోడుత బ్రోవు శీఘ్రము - శ్రీకాంత.

క. అయ్యోయ్యో ప్రాణనాయక, యీయెడ వనభూమి దిరుగ నెటు వలెనాయెక్, అయోధ్య వెడలి మనమిక, చయ్యన రాజ్యంబు విడచి జర గగనాయెక్.

వాదం - ఆదితాళం.

ధారుణినాయక మనముతనయులువినుడి యీఘోరమయిన అడవి లోన చేరియుంటిమి- ధారుణి.

చేరితే భయమేమి మనకు చెలియరోవినవే యీ యరణ్యమున ధీర విదులు నతివరోలేరే-ధా.

ఘనముగా మైనిండ యెండకాళ్ళుగాలగ వోజననిరో వోర్వగ లేము వినుమీా బాగుగా-ధా.

యేలికమదికిని దెలియదేమి మూర్ఖము నీమేలు బాసిన నేనే విధిని మేదినీశ్వరా-ధా.

బాలుర బాధకు నేను తాళగలేను నీ వేలను తెల్పగలేవు యేమి సేతునూ-ధా.

తరముగాని యీాపదచేసిన తలపనేనేను శరణుచేసెవాడ గాను వెరువబోనికను-ధా.

ముందరికెంతో ఆపదలు జెందెదా నీవు నీడెందమూననన్ను దలచి నానందమొందేవు - ధా.

ధ్వనులు యేమొ చేయబట్టె తరుచుగా నదిగో మామనమున దిగు లొందితిమీా మాతరో యిదిగో-ధా.

ఇదివరకు నీపైనగాని విధికిశరణనుమీా మేము ముదముతోనుండేగ్గ రోజమదికి తెల్పుము-ధా.

మనములోపల దలచె ఘనముగా మనము యేమికచేతమురా-౨. అధికముత్తు త్రాయె నోర్వలేము మదగజంబులు నిదుగో గని మేమెదనుచెదరితిమమ్మరో దిగులునొందకే నగమృగములజూచి తెగువగను విధిపగతలంచెనూ జగతి వల్లభుడెరుగడు దప్పిగొనిచాల - తడబడెవక్త్రంబు ఇవుడంబులు లేక పోయితె వినవే నిలువదుప్రాణము- అంబులును యీవనంబులోలేవ్వర కుంభినిలో వరభద్రగిరి రఘువరుడు మనలబ్రోచురా.

## విమలాంగివాక్యము.




గీ. ఇనకులేశ్వరవినుము యీవిపినమందు, వశముగానట్టి యాపద వచ్చెమనకు, బాలకులుబాధపెట్టుచు పడిరిభూమి, భద్రగిరివాస రక్షించు ప్రస్తుతింతు.

## రూపకం.

కరుణించుమీ సిరినాయక గిరిజావల్లభసాయక విరిశరధరుగన్న యన్నకరివరసేవిత సురవర్గ వరదాయక - కరు. దనుజాంతక నిఖిలేశ ముని హృత్కంజనివాసం వనజోద్భవజనక యనిశంబును పెనుమిను శిఖసఖునిన్ వినుతించెదనన్-కరు. పెనుపొందియు నాయెదలో నెరనమ్మితిసీ పాదారవిందం గరుడధ్వజదళ మురహారి జన ధరరూపక కిన్నరసన్నుతనన్ - క. నిశి యీయడవిని ఘోరం వశమానా దివిహారం శశిభాస్కర నయనసురారయ తరువుసుమీయని కోరితి కుశలవేళనన్- కరు.

వ. విమలాంగి రాజుతో నిట్లనియె.

గీ. రవికులాంబుధి సోమ ఆరణ్యమందు, పంతమును యేమివిధి మనకింతచేసె, యెంతకని నేను నీకుబోధింతు రేని, ఆపదలకోర్వ లేమయ్య అవనినాథ.

రాజువాక్యం.

గీ. వెనుక జిక్కితివేమె వో వెలదినీవు, త్రొందరెందుకు జెందేవు డెందమందు, నందనులతోడరావేని యందముగను, యిదిగో వచ్చెను శార్దూల మదరబోకు.

విధిరాజునకు విమలాంగికి వాదం - అటతాళం.

కందర్పుని సమసుందరులగు మనసందనులు ధరయందున క్షుధగొని మందిరమున నిద్రొందిన చందంబు ధరబడెరి సుందరమేలిక-కం. సుందరివినుా రాకేందుముఖ యరవిందాక్షిరో యెదనొందకె తొందర మందయాన యందెందెందుకు చందనగంధిర దిరపతిగలడిక పుడమిా పడయడవిడువుము మూర్ఖము అడవులలోబడి యిడుములు గుడిచేవు. అడుగడుగుకు భయపడి చేసిననిడు వడవడనే వడికెడివాడనెవినుా బడిబడి మాావెంబడి బడివచ్చేవు విడువిడుపోదిపుడు తడవాయెను-కం. కాంతుడ ఇదివరకింతాయెను యిక యెంతౌనో పంతంబంతను విడుమెంతకు నిను బోధింతును నే ధీమంతునీమది నుతియింపుము విధియని - కాం. ధరశ్రీ శుభగిరి హరిసాక్షిగా దొరవెలచుచు దిరుగగ నరవరయెరుగవా స్మరియించుము నాచరణారవిందము నురుముద మొందుచుపురమునకరిగేవు.

విధినాంచారి అదృశ్యం బాయె నంత.

రాజువాక్యం.

క. చిగురాకుబోడివినగదె, మృగమొక్కటి యదిగో చూడు ము దితరోగంటిఁ, ఇకమనకు క్షుదను బాధను, ఖగవాహాను కరుణతోడ గనుపడె చెలియా.

క. యెక్కడిదిది రాజమృగ్యమది, మక్కువ మదిజెందితీరి మాాయ మృగంబుఁ, చిక్కుట దుర్లభ మికవినుా, మిక్కడ గూర్చుండు నేను ఇకజనురాజా.

వాదం - కురుచ జంపె.

మగువరో వినవే నే మృగమునూ గొట్టితిసీ యీ మృగమును పక్వంబు యికనీవుచేయుము-మ. మాయమృగంబిది మను జేశవినవయ్యా నీయాజ్ఞ నేది లేదన జెప్పవశమ మాయమృగంబైతె మనకు జిక్కున యిపుడు-వో. రాయంచగమనరో పోయితెచ్చితినే మన్నించివిధియని మదికితెల్పుము రాజ యెన్నివిధముల మీకు విన్నవించుదును తరిగివండితె మనకు తనయులకునూ చాలు త్వరితంబుగనుజేయు తరుణి - సుందరిరో కరుణతో లక్ష్మణ వరుని సేవించిన యీధర భద్రగిరివాసు దయతో బ్రోచునుగా.

క. ముదితరో భాండంబొక్కటి, యదిగో నాతరువుక్రింద నగుపడె చెలియా, అందుకుపక్వము చేయుము, నిద్రించెద నిద్రచాల నెలతరో వచ్చెన్.

వ. అని రాజునిద్రించె నంత విధినాంచారి తనమనంబులో నిట్లని యెను.

క. ఎవ్వనిసతి యెవ్వనిసుతు, లెవ్వనిధన మూర్విలోన నేనిక దెలి యన్, ముప్పురుభక్షించిరిగన, మివ్వనమున నిద్రజెంది రిలసర్వేశా.

జంపెతాళం.

శ్రీరమణ నన్నుబ్రోవుదేవ యీఘోర విపినములో భూధవసార సాక్షుడ యిపుడు నారమణినినువిడచి యేరీతిభుజియించె ధారుణీలోజెల్లు. నతినినమ్మగరాదుసుమ్మి స్వామిసుతులతో నిద్రించెనమ్మి. పతితపావన నాదుగతినీవేయనిసమ్మి క్షితిలోనవుంటి సురపతిరక్షరిపు శిక్ష. ఆపదుద్ధార కుడవీవే మమ్ములతివేగరక్షించరావే పాపసంహారమునిపాల భద్రగిరీశ గోపతినుతమాకు దాపునీవేసుమ్మి. శ్రీర.

వ. అని రాజు నిద్రించె విమలాంగి మేల్కాంచి యిట్లనియె.

గీ. దైవమా యేమిసేయుదును ధాత్రిలోన, ధరణినాథుడు నాయందు దయనుదప్పి, మాంసమంతనుభక్షించె మనుజవరుడు, సతియుసుతులరడి రనకను సంతసమునా.

అటతాళం. జననాయక నీ తనయులమహా వనివిడచుట నీకును ధర్మ మహా. నరయేలికనీ కరమాడెనహా కరువునకు యీ తెరగాయె నహా. హృదయేశ్వర నేనిడురించగ హాక్షుధదీరెనని. యెదవొప్పెనహా. ఖగమూలకు నే దిగులొందితిహా మృగములకు యీ లగమూలకుహా. పతినీకును యీసుతు లెందుకు యీ సతియెందుకు యీక్షితిపోషకహా. వరభద్రగిరి శ్రీ వరుడేలు నుహా నిరతముగ నేస్మరియించెదహా.

వ. అంత రాజు మేల్కాంచి యిట్లనియె.

గీ. యింతినామదికి నీదుఃఖమింతదెలిసె, చాలుచాలును మళ్లినీజోలి యేల, కరువునకుయిట్టి దుర్బుద్ధిగలిగెనేమొ, సతికిపతికి యెందుకిక వినవె సరసిజాక్షి.

వాదం — జంపెతాళం.

వినుముయేలిక యిపుడు నిజముగనంత యికజెప్పెదు వెనువనము లోనదినమణి వంశననువిడచితివినీకుదగున భూజనవినుతలింతాయె. కొమ్మరో నిను సమ్మగరాదె ఇమ్మహిలో సుమ్మిక సమ్మతించితె ముద్దుగుమ్మ నా దయ లోన సమ్మతించుదు నెటుల సరసిజాక్షిరో భువిని. నరవరవిధి మాయగా రాజయెరుక్క నాయెద దెలియగా పురము వెడలించె గహ్వరము చరియించగ ధరవరుడమనకు యీ తెరగాయెనమ్మో చంచలాక్షిరో కల్లనె అనుభవించ నీకును జెల్లునె అంచయానరో తిందుమంచు అందరమిపుడు ఇంచుబోణిరో మృగముద్రుంచి తెచ్చితి ఇందు అంధకారము విపినము పొందుగా వెలసె ఘనము ఇందువంశాబ్ధి చంద్ర సంశయమేమి జెప్పగలదికనాదు నందనుల సాక్షిగను. సుందరివసుధతలము భద్రగిరిమందిసని మదిదలతుము యిందిరా ధిపుడుగలడు యికను యెంచను మగువ యిందుముఖ నేను మదియందు భయమొంద నిక.

గీ. అంతవిధిమాయ యేసుమ్మిఅవనినాథ, మాయమృగమాయ నీ చేతమడసిపోయె, మాంసమంతను మాయంబు మరియునాయె, నేను భక్షించినట్లుగ నెలవునాయె.

విధివాక్యం.

క. దిగులొందవింతజేసిన, యికజూడుము అయ్యోవిధము యినకుల సాధా, నగధీరనీదుపుణతిని, జగదీశ్వర బాపెదాను నిజంబుగవినరా.

విధివాక్యం - అటతాళం.

యేమిరాభూతలనాథ యెందుకు యీమూర్ఖమంత వనభూమిలో నాపదనీవు పుత్రులు సతిజెందినదెల్ల. దే. నన్ను గెల్వనీవశమా నె నర నాయక శరణొందవాయిక కానున్నదికనవోరి నేనునిన్ను వూరకవిడిచెద నాయక ధారుణివరభద్ర శైలధాముని సాక్షిగరాజ ధీరతతోడనుండెద నంచు మీరితివ నిలువరయిందు.

క. మా వెంబడిబడి వచ్చుచు, త్రోవంబడి పోకమమ్ము ద్రొక్కించు కొని, కావుమనిశరణుజేసిన, భావంబున భయముజెంది పలుకనెనీకుఁ.

నాదం - ఆదితాళం.

వినరాభూవరుడ నన్ను మదిగనరా విధినీకుశరణు యనియనరా సుఖ మొందెదవుమేదినిరా ఘనవనమున దినమణివంశజయిక మనమున మూర్ఖం బును జెందకనీవు తరుణివిడిపించితివి నాపురిని వోడించితివి సురవరుని నే నీకు శరణుయనధరశే సురవరుడ దరియుము గురమున వెఱవను నరవరు లం దరు స్మరియించెరుబహుత. పురము వెల్లించితిని గహ్వరము చరియించెదవు కాతరము వదలించెదను కావరము నరవరయుడ నీ తరుణిసుతుల మువ్వురిని బ్రోచెదను వెరువనీకిక. కలువకంటిరో నిన్ను మదితలప యెట్టులైనగాని సరి సలువా లిఖియించు ఫలమ్ముయా చెలువా జలములు యింకిన జలజాప్తుడు కలువల చెలికాడును యిల దిగులొందిన, అవురారాజేంద్ర నీవు యీ భువిలో నను దూరియిట్టులైతివిర యిదివరకు నయినదెలియవ్వర యువ నాశ్వునికే నుదయించితి నా కెవరుసాటిలే లేరుఘనుడనని. హరినివరభద్ర శైల శ్రీధరుని మదిలోన దలతుధరధరుని సురరాజవైరి సంహారుని నిరతము లక్ష్మణ నరునికి మోక్షము కరుణతో నిచ్చెడి కరివరదుని.

వ. విధినిదూషించి పోవుచుండగా విధివైశ్యునిరూపంబున రాకడ.

అటతాళం.

అన్నమశెట్టిని వినర నిండుపున్నమ తేజుడ గనర అన్న సత్రముబెట్టి యున్న యెల్లపుడు పన్నుగజనులంత సన్నుతిజేయగ. నవరత్నముల బేర మాడిన వైశ్యనరులందు ప్రఖ్యాతినొందిన సవినయముగ రాజసన్నిధికేగియు వివరముగనుధనము సవరించినాడను ధనధాన్యములకు కుబేరుడ మేదిని

యందు శ్రీకరుడ ఘనముగా భద్రాద్రి వనజనాభుని పాదవనజములను మన మునమ్మినాడను.

గీ. ధరణినాథుడ మాంధాతదొరకుసరిగ, నన్నునాపదజెందిపోతున్న దయ్యా, అన్నసత్రముబెట్టి మేమడవిలోన, నున్నవారమువినవయ్యా యుర్వి లోనా.

రా-గీ. వైశ్యకులజుడనేను యీవసుధయేలి, వైభవముబాసి నేను యీవనమునందు, తరుణి తనయులతో గూడి దండిగాను, కష్టపడ నాకు వ్రాసె పరమేష్టిసుమ్మా.

క. యీవత్తునెన్ననిచ్చట, భూవరమీసుతులుమీరు భుజియించుడు, కావలసినవన్ని బెట్టెద, నేమియుకాదు విందులే నీ సమయమునన్.



క. జగదీశపట్టుపచ్చడ, ముగనీవును గప్పుకొమ్ము యినకులనాథా, సుగుణావళి చలువపుట్టము, నగుమోముతో గట్టుకొమ్ము నారీమణిగో.

రా-క. తనయులు తరుణియు నేనిక, ఘనముగ భుజియించితిమికడు మోదమునను, జనవలెను నాజ్ఞ యిప్పుడు, విను వేగముతోడ మాకుయీసమ యమునన్.

వాదం - అటతాళం.

పోయెదరెందు నుర్వీశ మిమ్ముపోనివ్వనేను ప్రకాశా మెందుకుపోని వ్వనంచు నీవుయిందు నట్టులింక విన్నవించు - పైకమిచ్చిపొండిరాజ ఆపైన యేమనభానుతేజ పైకమెక్కడిదయ్యా మీకు మాపైన కోపమెందబోకుర- తాతసొమ్మని తిన్నారా మీతండ్రిసొమ్మని తిన్నారా పట్టుపచ్చడమును

మేము గట్టుపుట్ట మిచ్చిబోయెదము - పిల్లలను బట్టిమేముయీగొల్లెమునకు గట్టెదము- గట్టితే భద్రాచలేశు మమ్ము నెట్టులైన దయబ్రోచు.

విమలాంగి.

గీ. పిల్లలనుగట్టబోకయ్య గొల్లెమునకును, వారలేమియు నిచ్చెదరు తలచుసుమ్మీ, అన్నమావద్దయేమి గలిగున్నమీరు, యివ్వకుంటివి మన్నించుమిపుడు మమ్ము.

అటతాళము.

యేమిసేతు ప్రాణేశా నేనేమి కోమటిపుత్రుల గొల్లెనాకుగట్టరా- భామామణి నావశమైతే వైశ్యు డెట్లువిడుచునోకాని మమ్ములను శెట్టియు గట్టె-మం. అమ్మరోవిడిపించుకొమ్ము శీఘ్రింబునా ఖేదమొంది బాలురు చాల - మేదినీశ్వర వున్నయదరించెద రెవరూ. యెన్నడయిన మనలవిడచి నెన్నవారలుగారు వోర్చెటులుందురు బ్రోవుభద్రశైలనివాస బ్రోవూ నీవేగాక మమ్ముగావ నెవ్వరు లేరూ-

విమలాంగివాక్యం.

గీ. శిశువులను బాధపెట్టకు చిన్నవారు, బలిమిచే నీవుమమ్ముల బిలచియిట్లు, ఎంతఆపదబెట్టిన యేమిలేదు, విడువు వైశ్యుడ బోయెదము లేడవునాయె.

వ. అనిన వైశ్యుండు వ్యాపారి అదృశింబాయె నంత కొంతదూరంబునకు వచ్చి విమలాంగి యిట్లనియె.

గీ. కమలలోచన అయ్యయ్యో కాననమున, యేమిసేతుము మాకిక యెవరుదిక్కు-, అన్న ఆహారంబులును బాసి యవస్తపడుచు, సుతులతో గూడి వనభూమి జూడనాయె.

రూపకం.

శ్రీపద్మాధీశాయ శ్రితభక్తమందార - దాపెనీవై బ్రోవు దనుజసంహార-హరిశరభ చిరుతకాసర గండభేరుండ కరిశార్దూలములార కడతేర్చరారే- తరులారగిరులార ధరనంబరములారా వురగవరాహములారా కరుణించరారే - క్రౌంచికలరవకోకిలచంచరీకములార అంచబృందములార అప్తులైరారే - సోమార్కనేత్ర మీభూమిలో భద్రాద్రిధామ మునిజనపాల దరిచేర్చరారే.

రా-క॥ భామామణి వినుసధర్మిణీ। సోమాననపురమువిడిచి సుందరివినవే। నామాననమందు చేసిన। నేమంబును విడువలేను నీరజనేత్రీ॥

సాదం - అటతాళం.

ఇకనైన చాలించు విధినిదూషించకు దిగులునొందితి బాలనేడు వినుము నేడు జగతివల్లభా తెగువతో యీమృగములనుజూచికన్నులా మగువవగువను తగదు గదన దిగులునొందక నోర్తుమెట్టుల - కలకంఠకంఠి నాయిలు వెలువరించి కానలుచాలచరియించజేసె యేమిచేసె వెలది వినగదె నేను బలికినపలుకువిడిచి యిలధనంబులు బలుడ నేననితలచి కొలువరువలదు చెలియరో భయముయెందుకు॥ విధి॥ క్షితిలోన నీదుపద్ధతి వదలలేవ యీగతి నొందజేసితిరాడా - భానుతేజపృధివితలపతి హితవు నీసతిమతికి జెప్పితె గతిగానవు - నతిముదముతో నున్నమూర్ఖమతివినీసతి సుతుల బాపెద॥ 3॥ ఇ॥ పుటభేదనముబాసి పటుతరవనభూమి - కటు జేరవస్త్రీమి నుమ్మి - నిన్నునమ్మిఘటము నీగటమటుల చేయకు - కటకటంబడి దుటము విడిచితి - నెట్టుల జేసిన నీకుశరణిక కుటిలముంచకు హారముయేలను॥ ౪॥ రా॥ చందనగంధి నాముందరవానికి - వందనములు చేయతగునా - ధర్మమగునా- మందగమనరో నిన్నుఅది యేచందమున నందులజేసిన - డెందమునరుఖుడుపొందెరా అరవిందనేత్ర వసుంధరేశుడ॥ ౫॥ విధి॥ ఉల్లములో నమ్మ కల్లగానిమాట - కొల్లలుగావది నీవుజెందెదవు - అల్ల యీవన భూమిలోపల తల్లడిం పుచునీదుగుండె గుభిల్లుమనగను భద్రగిరి శ్రీవల్లభుని పాదములసాక్షిగ॥ ౬॥

వ. విధి అదృశ్యంబాయె నంత కొంతదూరంబునను కాపుస్త్రీ స్వరూపంబునకువచ్చి యిట్లనియె.

గీ॥ ధరణినాయక మీరెవరు తరుణితోను। తనయులతోగూడి వన భూమి తటచుగాను। తిరుగుకొంచును వస్త్రీగి ధీరవరుడ। తెలియపఱచుడు నాకిపుడు తేటపడగ॥

రాజువాక్యం.

క॥ యినవంశ్యుడ మాంధాతను। తనయులతో తరుణితోను తామరసనిభా। వనభూమి దిరుగుమాకును। వనజాననను డీటులవ్రాసె హో చంద్రముఖీ॥

విమ - విధికి.

పాదం - అటతాళం.

అన్నాహారము లేక వనముదిరుగుచున్నాము వినవమ్మ ఘనము - మున్ను యీకష్టము లెన్నడు మెరుగని - చిన్నికుమారులు నన్నుబాధించగ॥ ౧॥ చింతేల నీకుమాయమ్మ-మనము ఇంతలోబోదముసుమ్మ-సంతోషమున మాదు చెంతనుంచెద మిమ్ము - ఇంతకష్టము మీకునింతి యెందుకు లెమ్మి॥ ౨॥ పసిబాలురను నడచినడచి - యిందుపవళించినారమ్మ అలసి - శశిముఖ నేనేమిసేయుదట్టులతల్లి - నిశియీయడవి దిరుగ వశముగా దికమాకు॥ ౩॥ నీపూర్వఫలము మాతల్లి - చింతనీవు జేయకు కల్పవల్లి - మాపురమునకు మిమ్ము యీపట్లగొనిపోయి - కాపాడెదను సుమ్ముకాంతరో వెలవకు॥ ౪॥ కూలినాలియు జేయ స్వామి - మాకు యేలీలజేస్తివిదేమి - చాలదుష్కృతము శ్రీలోలజేసితిమేమి - మేలు బాపియువనము పాలుజేసితివయ్యో॥ ౫॥ ధరణిభద్ర మహీంద్రవాసుడు మిమ్ముదయతో బ్రోచుసర్వేశుడు-వరకొండపురినుండు సరవిభటుల లక్ష్మణ-నరునిబోషించెను కరుణచే నిరతము॥ ౬॥

క॥ చింతించనీకు నెందుకు । సంతోషముతోడ లెమ్ము సరసిజనేత్రీ । యింతలొమాపురిలోపలి। చెంతను నుంచెదనుమిమ్ము చెలియరో వేడ్క॥

విధి - గీ॥ మాయపురమును మావూరుమనుజనాథ । నంచునాలవ జాతియెయవని వెలసె । కూలినాలియు జేయించి బాలురకును । నీకునీసతికి అన్నంబు నేనయిడుదు॥

వాదం - ఆదితాళం.

ప్రొద్దాయెనారుక గొయ్యపొమ్మి భూతలనాథ ప్రొద్దుగూకెదను యీప్రొద్దుకష్టము జేయు॥ కొడువలిలేక యెట్టులగోతునే నార్కతల్లి-పడతినీవన్న విధముపగజేసెద నేను॥ యిదిగో కొడువలిదెస్తి నిపుడె నీవు దీసుకొమ్మి తదుపరి నేనువత్తు త్వరగా చేనుకువినర॥ ౩॥ పిడిలేనికొడవలిస్తె పిడికిలెట్టులబడుదు కడుపుకొరకు యింత కష్టము జెప్పితివి॥ ౪॥ కొంకెపొమ్మిమాయింట పోకుంటె చెల్లదిపుడు - యీతీరుబల్కదగున బాధకముగ వేగ॥ ౫॥ నాయందుకోపమేమి బ్రోయెదభద్రగిరి - కామజ జనక యేమిసేయుదు దైవరాయ॥ ౬॥

గీ॥ నీవుయీయర్కలునుదంచి నేనువచ్చు। వరకుతాంబూలములు జేయువనితనీవు। జేయకుండితె నాయింట జెల్లదికను। అర్కచేసుకునేబోదు అరిగెభర్తా॥

విమలాంగి.



గీ॥ దంచిదంచియు నామదితల్లడిల్లె। వక్కతైననుతంగదు వనితవచ్చి। నన్ను యేమనిపల్కునో నాధనీకు। ఆపదెంతయు గలిగెనోదాపు యెవరూ॥

ఆటతాళం.

ప్రాణనాయకు నాకాపద యెంతగలిగెనో - నాకుయెవ్వరు లేరు దైవమా - అయ్యయ్యయ్యో దైవమాదైవమా॥ ప॥ పురమువిడచిగహ్వరము చరియించగ - తగుణిదోడుకవచ్చె దైవమా॥ అ॥ మున్ను యెన్నడైన మేమును యెరుగలేదిట్టి-పనులుజెప్పెను మాకుదైవమా॥ ౨॥ అరచేతులకు బుగ్గలధికముగానువచ్చె- తెరముగాదిక నాకుదైవమా॥ ౩॥ వరభద్రకు ధర మందిరకరుణదప్పెమీ తెరగునాయెనయ్యోదైవమా॥

రాజువాక్యం.

గీ॥ కొయ్యబోయితె యిపుడు నాచెయ్యిదెగెను। రుధిరమధికంబుగారెను మదినినిల్వ। దెటుల సేయుదునన్న యేమందురోక। చేనుస్త్రీ యిక్కడికివచ్చె శీఘ్రముగను॥

వాదం - అటతాళం.

యేమిరకూర్చున్నవు నారుకగొయ్యవేమీ - మోముజూచెదవేమీ యొద్దునానీవిందు॥ యేమి॥ ౧॥ యెన్నడైనగాని - మీపనినాకు॥ యెం॥

కన్నులతో నెరుగ కరముగోసుకొంటు॥ అ॥ చయ్యాన నీవులెమ్మి యిచ్చుట వలను॥ స॥ కొయ్యలేకను చెయ్యి గోసుకుంటివి మొద్దు॥ ౩॥ కోమల మొందబోకు - మాయమ్మరో॥కో॥ యేమిసేయుదు నాకింకేమైనపని జెప్పు॥-ర॥ ఆరాకలును యెత్తుకనీవు వేగ॥ ఆ॥ పోరానాయింటికి - నోరినామది యొప్పు॥రా॥ గి॥ అలాగె యెత్తుకొని పోయెదసుమ్మి- చాలగభద్రాద్రిస్వామి మమ్మేలబ్రోచు॥ నాలాగె॥ ౬॥

వ. రాజు పోవుచుండగ విజయాభవాయనిన నొక్కబ్రాహ్మణునకు ఆళ్ళముళ్ళెయిచ్చి చనెనంత.

విధినాంచార యిట్లనియె.

గీ॥ అళ్ళముళ్ళెందు బెడితివే మాయెదెల్పు। మొద్దువలెబలిసి నీవిందు ముద్దుగాను। వచ్చినావుర నామది హెచ్చుదికను। విన్నవించుము నాతోను వేగిరమున॥

వాదం - అటతాళం.

రాజువాక్యం.



క॥ వినవమ్మవిప్రుడొక్కడు। చనుదెంచియు। బాలగను విజయాభవ యనినన్। కొనియాడె నేను బెట్టితి। ననుమన్నన చేయుతల్లి నారీమణిరో॥ ౧

వాదం - అటతాళం.

కూలివాడవు ద్విజునకును యెట్టుల బెట్టి నీవు వచ్చినావు॥ విమ॥ అధి కుండునావిభుడు అమ్మరోనీవు తిట్టబోకు శరణునీకు॥ నీకు జెప్పినపని నీవుజేసి నావ లేదానాతోవాదా॥ అరచేతులకు బుగ్గలధికముగనువచ్చె గాంచు నను పోషించు॥ యెట్లుజేసితివి నీవిభుడట్లజేసె నేనోర్వలేను-ధరణిలో భద్రాద్రి ధామునిసాక్షిగ లెమ్ముపోపొమ్ము॥ ౬॥

వాదం - ఆదితాళం.

విధిపదనమ్మ వైశ్యునింట పండుగ నేడుచెలియ॥ ముదితసకల భూషణములదిగో నీవుబెట్టుకొమ్మి॥ ౧॥ విను॥ భూధవునాజ్ఞ యిపుడు నీద యతోనుబోయి - మోదముతోనువత్తు మీపాదము నమ్ముకొని॥ ౨॥ రా॥నాగయానరోనీవు నేగుముసంతసమున .. వేగిరమునబోయి వెలది వెం బడిరమ్మి॥ ౩॥ విధి॥ నారినిదెస్సిపటు నీవుగోరిన చెలియనిపుడు - కూరిమి తోడనేలుము భేదుడనేను బోధు॥ విమ॥ అమ్మ ననుదెచ్చినసీవు అంట ధర్మమౌన - యిమ్మహీశుని భార్యనుసుమ్మి నిలుపు మాయమ్మ॥ ౪॥ విధి॥ వినవెవిమలాంగి నేనువిధిని మచ్చక్రవర్తు - దునుమగ కలహమును గలు గగజేసినాను॥ ౬॥ నమ్మితి నన్నుజెరుపు న్యాయమాతల్లీ నీకు - సమ్మత మాయెనెట్లు కొమ్మనప్పగించి॥ ౭॥ అయోధ్యలోనవీడు ఆడినమాటలకు - పొయ్యెననాడు పేరబొమ్మను గట్టింపించె॥ ౮॥ భాసురబట్టె లక్ష్మణదాసుని బ్రోచినట్టె వాసిగిభద్రగిరిని వాసుడె యేలునమ్మా॥

వ. వైశ్యునికి అప్పగించిపోయిన వైశ్యం డిట్లనియె.

వైశ్యునివాక్యం.

క॥ యీవనితి నెట్లువిధితా। గావించెనో గాంచగాను కడుచిత్రంబుగ। నావశము గాదువర్ణన। గావించను బ్రహ్మవశమె ఘనముదమారెగ॥

ఆదితాళం.

ఎంతని వర్ణింతుకాంతశృంగారము - బలువింతలు గుసుమ బంతి ఇంతి॥ కాం॥సామజయాన దీనినామ మేమందురో - దీనిమోము మరుని చందమా

మనుమించుకాంతి॥ పల్లవపాణిదీనిపలుకు లమృతము - వెలిమల్లెమొగ్గలసరి జెల్లు దంతములు॥ భూవలయమందున-యేకోటిసరిలేదురా - యిదిభావజు చిలుకను భామవయ్యారిరా॥ భద్రాద్రివాసుడు పణతిరొ్బ్రోచునే .- దీని కధీశుడౌ రామభద్రు డిచ్చుకాంతి॥

విమలాంగి వాక్యం.

ద్విపద॥ కామాంధకారము కన్నులగప్పి - యీమాట బలికితివి యేమందునిన్ను - భూపతిభార్యనని బుద్ధియు లేద - శాపంబుబెట్టితె చెడిపొ య్యెదవు - పరమపతివ్రతనురా పణతులలోన - కరమెట్టువచ్చెనను గట్టి గాబట్టి - పరస్త్రీని. తల్లిగాభావించవలెను - పరద్రవ్యమునుగోరట పాతక మునీకు - నీమాటగావింతు నిజముగానేన - నోములలో ఘనతనోమును గలదు - అదియును గడపితె యిదియు నిజంబూ॥



క॥ ముదితరో భాండంబొక్కటి । నదిగో యాంతరువుక్రింద నగుబడె చెలియా । అందుకుపక్వము చేయుము । నిద్రించెద నిద్రచాల నెలతరో వచ్చెన్॥

వాదం - చౌకం.

ఇందురావే సుందారిలేవే - యిందురావె శరదిందుముఖిరో - నా డెందము తొందరజెందెను తాళను॥ వలదువలదు రఘుకులుడ పరనెలతలను పలుకులిటుల బలుకగను న్యాయమగు భామామణి - పల్లవపాణి కోమల

గాత్రి నీకేమికొదువ లెమ్మా - కాముని కేళిలో గలసిసుఖంతమూ నిర్భయముతోడ నీవు దుర్భాషలు బలికెదవూ దుర్బలుండుగాడు పతిదుమికిపడ కిట్టులను-గట్టిగాను యిట్టులాను కట్టడితనములు - గట్టిపెట్టుమిక యెట్టులైన నిన్ను యింతిరో విడువనె పన్నుగను- నీవు మాయన్నవని నమ్మితిని నన్ను యిట్టులననుచున్న పురదుర్మార్గమూ - మదనకటారి ముదితమిటారి మధురాధరి నా హృదయమునిలువదు యెదయెద చేరు నెమ్మది ముద. మొందగా ధరణిపై లక్ష్మణాఖ్య వరద వరభద్రగిరి - వరరాఘవ యీవైశ్యుని కరములోనేజిక్కితి.

## విధివాక్యం.

క॥ నావద్ద నిలుప నివ్వక । నీవల్లభు నిపుడువెళ్ళ నేనుగొట్టెదర ।
భావంబున నమ్మగట్టిగ । గావించెద యిట్టిమాట కాంతరో వేగర॥

## వాదం - అటతాళం.

న్యాయమగునే మాయమ్మతగునే మాయచేనీవు దుర్మార్గుచేతుల జెట్టిపోయెద వికనిల్వు పోను జెల్లదునీకు॥ న్యా॥ ఓరాజమహిషిరో ధీరుడంచు నన్ననక తనరిలేనంచు పలికెను ధారుణీశునక దూరినందుకీ । తీరుజేసితిని చారుసుగాత్రిలో॥ వినుమునిన్ను విధిబాపెనన్ను వినుము వినుమనియెనో యీ విహితంబులును నీకు వినుపించగను రాజవిననై తినికయట్లూ నేనిపుడు నీ ప్రాణేశునకు - ఘనకాననమున యేరులోన ముంచెదను బాపమర్ది మామలకిందీ తనమేనుదాతునే నీరజముఖి విను- సుతులబాపె వైశ్యునకూను జూపె పతినీకు నీసుతులా బాపుదనుచు - బలికె నతిమోదమున యిందు బ్రతికినేనుండేన వాసించు మంత్రుల - దూషించి పంతంబుచేసి పలికనే నీ సమయంబున భాసురభద్రాచలేశుని సాక్షిగచేసెద నిటుల కోసలాదీశు॥ వాళం॥

వ. ఆ సమయంబున విధి అదృశ్యంబాయె నంత విమలాంగి పతిని గూర్చి యిట్లనియె.

## అటతాళం.

యేమిసేతు ప్రాణేశ నేనేమిసేతు- భూమీశ్వరుడ మనకేమి యాపద వచ్చెనేమి మానసమున దగిలెచింత నా శిశువులబాసితి కాంతనన్ను చాన

దెచ్చెను వీనిచెంత నా మేనునిలువదు రాజ మానవనాథా - నేనే నేమము చేసితి నేడు - నన్ను నేమము వెళ్ళితె వీడు - రాజుయేమి చేసెదరో జోడు బాపె దామోదరుడు వినుమీ కోమలగాత్రినే॥ వరుల బాసినట్టిస్త్రీలు - లేదుమరణ మొందినవెమేలు - యీధరలో శ్రీకరభద్రగిరీ వాసుడేలు కరుణతో॥

వ. యిక్కడ విమలాంగి యీలాగుననుండె కుమారులు తండ్రితో ననుట.

క॥ జనకుడమాజన నిప్పుడు । జనుదెంచకపోయె నెందు జననో మాకుఁ । వినిచెప్పు డిపుడుమీరలు। ననుమానము దోచెతండ్రి నాత్మలో మాకుఁ ॥

రాజు విధితో ననుటః

క॥ శుకవాణి నిన్ను నమ్మియు । సఖయను దోలించిదీని సంతోషముగఁ। ఇకనీవు విడచివచ్చుట। యొకవింతయు దోచెనాకు నోగజగమనా॥

వాదం - అటతాళం.

ధరవరవినరా సీతరుణీ చేసినచేష్ట - మరునిమించి సుందరునియొక్కని గూడి - నరవడయుడ వేట్కలలరగ నుండిన కలకంఠి యటువంటి చెలియగాదా నన్ను - కలనైన మరువనికాంత యేమోవింత - వెలది నీవెంబడిని నమ్మి నా కలువకంఠిని దోలినందుకు - వెలది నెక్కడ విడిచి నీవిపుడేగు దెంచితి వికను దెల్పవు - కుటిలాత్మతగునా నన్నిటుల పల్కుటనీకు - యెటులనో రాడారా నీకుటిలకుంతలినన్ను - హాతముతో మాటలాడె తటకూనదల్లిగాంచు॥ జన నిజననియంచు ఘనముగ భేదము తనయులు జేసేరుచాలా - తెల్పవేలా - భద్రగిరీశు పదములు అనుదినము నేదలచెదను మురసునను లక్ష్మణసగుని బ్రోచిన కనకపీతాంబరునినామది.

విధివాంచారి వాక్యం.

క॥ భూనాథ పాపమనిమిము । కాననమున నుండిరాగ గనిరమ్మనినఁ। నేనిందు దోడ్కవచ్చితి । నానేరంబేమిపొమ్ము నాపురినుండఁ॥

వ. అని రాజు తనమనంబున నిట్లని తలంచె.

క॥ ఇనుడును గ్రుంకెనుదైవము । కనుచీకటినాయెదారి గనుపడ దెటులన్ । వనజాక్షి బాసితిప్పుడు । వనములు చరియించనాయె వారిజ నయనా॥

జంపెతాళం.

యేమిసేయుదు భక్తపాల । యీభూమిలో శ్రీలక్ష్మిలోల । ప్రేమతో మమ్ముబ్రోవు సోమకాసురహరణ । సోమార్క నేత్ర నాకోమలిని బాసితిక॥ కానరాదుదారి వనములోన వానగురియసాగె ఘనము । మానసంబునర్ఘుడసి మహాదుఃఖమొందుచును సూనులున్నారయ్యో నేనేమిసేతు నిక॥ యేగతియిక ధూళిగప్పె । గగనభాగమంతట కాటుకగప్పె మేఘములు గర్జిల్లె మెరపులుబుట్టెను చాల। బాగుగారక్షించుపంకజోదవజనక॥ పుడమిలో భద్రాద్రివాసానన్ను । కడువేగబ్రోవు సర్వేశ । పిడుగులువడిగండ్లు బిరుసుగమేమీద పడుచున్నవే తరువుకడకు నేగెదమన్న॥

గీ॥ పులుగువాహనపాడు కోవెలముదొరికె । ఇందులో నుందమని యన్న ఇపుడుదంతి । యరుగుదెంచుచునున్నది ఆగ్రహమున । వ్యాఘ్రమునులు మీదబడునట్లు వచ్చెవేగ॥

తండ్రికొడుకులకు వాదం.

అటతాళం.

యేమిసేయుదు నేను ఇకనుదైవ మెటుల దెచ్చెను తనయులకు సోమభాస్కర నేత్రసురనుత సామజాధిపవరదమణిధర సమరాంతకమమ్ము బ్రోవుము కామకోటివిలాస శ్రీహరి॥ కనుడువచ్చెను సింహమికను నాయన ధ్వనిజేసుకుంటిచాలగను మనము ఇప్పుడు జనకకోవెలమునను నిలువను వలదుసుమ్మికచనియు నెక్కడనైననుండియు మనుజనాయక బ్రతికెదము వినుు॥ మనముయీపాడుకోవెలమునుండి చనుదాము యిపుడు వేగిరము తనయునేనుండగను మీామనమునను దిగులును జెందినోల్లక కనకచేలుని కరుణమనపై గలుగదాయెను యేమిసేతము॥ అంధకారమునయినవనము । కష్టమొందవలసెను ఘనము యుంది రేశ్వర మీదుకరుణమాయందు నెందుకు రాకయున్నది యిందుసేఖర సఖశుభాచల మందిరాంబుజనేత్ర బ్రోవుము॥

గీ॥ పసిడికంకెలు బలికిన పలుకులన్ని । కాననమున నెగంటిని ఘనము గాను । కొంతకాలంబునకు నాదుకాంతనన్ను । గలుసునయోధ్యముదమున గాంచెదను॥

తండ్రి కొడుకులతో ననుట.

గీ॥ దండియేరిది దాటుట తరముగాదు । నీకుతమ్ముని దోడుక నిండు యేరు । దాటియావలదించి నేవాటముగను । వచ్చెదను పుత్ర యిటువుండు వలదు సుమ్మీ॥

వాదం - అటతాళం.

ఒక్కడనెట్టుల యిక్కడనుందును మక్కువతోడుతమముగన్నతండ్రి విను॥ నంధనవినర అందునీతమ్ముని సుందరదించినేనిం దరుదెంచెద॥ యిరువురినెత్తుక ఇపుడునాయన అరుగుడుమమ్ముల కరుణచేబ్రోవుడు॥ దండియేరిది నుండలేమురా మెండుగనోచె నిది గండముదాటుట॥ మన్నన జేయుము నాయన్న దేవుండను పన్నుగనాదుయన్న నున్నదిభయమిక॥ భాసురభద్రాచల వాసుడు నీదయ దాసదాసలక్ష్మణ దాసునిబ్రోచిన॥

వ. అపుడు కానుగువృక్షంబునకు పెద్దకుమారునిగట్టి యేరుదాటి చిన్నకుమారునితో నిట్లనియె.

క. నాయన్న వినుమి యిప్పుడు । మీాయన్నను దోడుకొని మేలుగ వత్తున్ । నీయేరుసమముగానే । నేయేరును జూడలేదు నీయిలయందున్॥

వాదం - అటతాళం.

నాయన్న నొక్కడ నేనుండవో నాయన॥ నాయందుదయదలచి నన్ను దోడుకపొమ్మి॥ మీాయన్న యిట్టుల బల్కగాను నేమీానాయన్న వృక్షమున గట్టునది దెల్పు॥ నీవెన్నిమారులు బల్కినతండ్రి నేనుండ భయమౌను నీవెంటవచ్చెద॥ నావెంటవద్దుర నిలువుమ నావిన్నపమువినుమి నాతండ్రి వలదుర॥ వేవేగబోయెద వేమి ననువిడచి నేవచ్చెదను జనక నిలువుమీా అచ్చోటు॥ క్షోణిభద్రగిరీశునిచే బ్రోచు సూనుడనిన్ను యీామానుకు గట్టెద॥

గీ॥ చిన్ని నందనసవిసర మీాయన్ననిపుడు । తరువుసకు గట్టివచ్చితి మి వెతిచెనేమొ । నుండపురవావిలికి గడితినుండుమికను । నీదులన్నను దోడుక నేనువత్తు॥

## యాలలు.

శ్రీనాథ నేనుగన్నట్టి మానూలతరులాకుగట్టి నేనుయేరులోన జేరితి అల్లవోసర్వేశదారి కానరాదుయేమిసేయుదు॥ బిరబిరసుడి దిరుగబట్టె తరుమాకసన్ను పసగొట్టె తరముగాదుదాటుదేలాగు॥ వైకుంఠవాస మరి మదినురుగులు తెప్పలు॥ ముద్దియను ముందుబాసి యిద్దరిసుతులనువిడిచి మద్దియేరుల క్రింద జేరితి హా సర్వేశ్వరా యిద్దరభద్రగిరీశ్వరా॥

## విధినాంచారి వాక్యం.

క॥ యిదివరకైనను ధరవర । మదిలోపలదెలియలేవు మానవనాథా । విధినీకు శరణు యంటెను । ముదముతోనుండేవురాజ ముందట పలెనూ॥

## రాజవాక్యం.

ద్వి॥ నినుదలచకను నేను నేమంబుచేత । విసకనేపట్నంబు విడిచి వచ్చితిని । మున్ను నాసతివిడచిమోదంబుబాసి । కన్నట్టిసుతులనుగట్టిమానులకు । యేరులోపలమద్దియేరులక్రింద । జెందితిఇంకేమి జేసేవునన్ను । పురుష గర్భములందు బుట్టినవాడ । వెరువనేనిక నెందు వేడ్కతోనుందు॥

## విధివాక్యం - ఆదితాళం.

యింత జేసినగాని రేడుహృదయములోన రవ్వంతైన భీతిజెందబోడు యింతిని బాపినచింతలేక బహుసంతసమున ననుపంతములాడెను॥ గొప్ప యేరుగావించితిని బడిబడినీరులిపుడు వీనినేముంచితిని తప్పదుపద్ధతి యిప్పటికైనను చప్పుడుచేయక సరసుడున్నడు ఇద్దరిసుతులగట్టి ఓరివెరువకనీలి మద్దియేరులకింద జేరి పద్ధతిజగతి ప్రసిద్ధిగాను బహుజిద్దుజేసితివి వద్దికిజేరను॥ శరణంటివీనిము ల్లైయేమి తరిగినేపోయి ధరణివరభద్రశైలస్వామి నిరతము లక్ష్మణనరరక్షకనా తరముగాదు భూవరునిజయించను॥

వ. అని విధివేసరె నంత.

అన్నదమ్ములకు వాదం.



అటతాళం.

అన్నయ్యవినుమీ నాయన యేరులోబోయె కన్ననారలబాసి యున్నామిచటమనము॥ నాముద్దుతమ్ముడ యేమిదెల్పుదునీకు యేమిసేయుదు స్వామి ఇటులదెచ్చె॥ భువిలోన శ్రీలక్ష్మీధవుడు యిట్టుజేసె సవరించెవారలు యెవరుదిక్కిట లేదు॥ మనమిరువుర మొక్కటనువుండు దామనిన ననుగట్టి తెరువునకును యెటుల నేవత్తు క్రూరసర్పంబులు యేరువొడ్డుననుండి దారి దప్పియు యిటకు తర్లివస్తున్నాది॥ ధరణి శ్రీవరభద్రగిరివాసుడే బ్రోచు వెరువ నెందుకునీవు వేడ్కతోనుండుము॥

వ. అపుడు నందపురంబుననుండి వైశ్యుండేగుదెంచి వృక్షంబులకు గట్టిన శిశువులంజూచి యిట్లనియె.

గీ॥ శత్రులెవ్వారొ మిమ్ముల చెట్టులకును। గట్టినారయ్యొ మిమ్ముల గన్నతల్లి। దండ్రినామంబు జెప్పుడు తప్పకను విడిచి। తోడుకపోదు నే నిపుడుమిమ్ము॥

బాలకుల వాక్యం.

గీ॥ వినుము వైశ్యుడ నీవిపుడు వేడ్కతోడ । తల్లి విమలాంగి తండ్రి మాంధాతరాజు । ధరణిపై వెలయు నయోధ్యపురము మాది । విధికి రాజ్యంబు నోడి తానిందు జేరె॥

వ. అనిన బాలకుల విడుచుకొని తనమందిరంబునకుం జేరి తనకు సుతులు లేరని గారవంబున పెంచుచుం డె నంత.

ప్రధాని వైశ్యునితో ననుట.



గీ॥ వినరఅన్న మసెట్టి నికిట్టిసుతులు । గతి గెగిన్నడు నీదుమార్గంబు దెలిసె । వీరిజాగ్రతజూచి నేనిందువస్తి । భ్రాత లేశునిపుత్రులు పృథివిలోనా॥

వైశ్యుని.

క॥ నాయందు కోపమెందుకు । మాయన్నకుమారులయ్యా మరి యొకరైతే । మాయింటిలోన నుందురు । నీయెడమన్నించరయ్యా నిల్వరమంత్రీ॥

వాదం – పంచచామరం.

భావమందు భయములేక బట్టిదెచ్చిబిడ్డలన్ । నీవు నాతో యిట్టి మాటనిక్కమని యంటవు । తప్పో వొప్పో జేసితి నీదండనంబు జేయుడీ । చెప్పెదానువున్నమనవి చెవులకాలకించుడీ॥ కావరంబ వున్నవార్త

ఘుట్టిగాను జెప్పవు । యేవిధంబుతోడ వీర్ని వెంబడించుకొస్తివి । రాజ మంత్రివిన్నుము నేను రాగయేరవద్దకుఁ । వైరముగాగట్టి రెవతొ నేను దెచ్చిపెంచితిఁ॥ అస్త్రవిద్యలందు వీరు అధికమైన శూరులు । శస్త్రవిద్య లందు నీతిశాస్త్రమందు చతురులుఁ॥ రాజపుత్రులైతె వీర్ని రక్షణంబు జేయుడి । తేజమంత భద్రశైల దేవసుతుడు బ్రోచుతఁ॥

వ. అనిన బాలకులప్రధాని బెంచుచుండె నంత.

మాంధాత వాక్యం.

ద్వి॥ యవనాశ్వగర్భమున యేనుజన్మించి । అవనియేలితి నేను అధి కంబుగాను । కావరంబున హరుని ఖండించబోతి । దేవేంద్రునకునాకు దిన యుద్ధమాయె। యుద్ధంబుమాన్పను యీశ్వరావచ్చి । యిద్దరు సమమంటె యేనుకాద్రాన । నీమీదకోపి స్తినీలకంధరుడ । స్వామినాతోనీవుసమ్మతించి తివి।ఆపదనీకువచ్చినపుడు నేను । బాపురేశివయంటె ప్రత్యక్షమాదు । నం టివియీవేళ నరుదెంచుమీశా॥

అటతాళము.

రజితాద్రినిలయ పంకజభవసంస్తుత గజచర్మధర । పావననేత్రాధవళ గాత్రా॥ భుజగభూషణసుజననుత క్రతుజ వ్రజార్చిత త్రిజగసన్నుత కుజన హర మనసిజమదాంతక నిజమునీపద రజముగోరితి॥ సురమానివినుతకిన్నెర రాజపూజిత కరుణసార గిరిజలోల భక్తపాలా వెరువకను సురవరునితో మునుదురముసేయగ నరుగుదెంచియు యిరువురినిసరిపఱచికరుణచె వరము లిస్తిరి మరువబోకిక। కాళిమాళిభీమా పారిషదా ప్రస్తుత ప్రేమ నరసిబ్రోవ రారభూతేశ దాసపోషనను మల్లీధరచాప పశుపతి వృషతురంగ శుభాంగ ధూర్జటి వసుధజననుతమానసాకస వాహావందిత పంచముఖశివ॥ కుంభినీ భద్రాద్రిఅంబుజాక్షమిత్రఅంబరశిఖిమృత్యు హరణా సేతుస్మరణ॥ శంభుశివ సర్వంబు యీవిశ్వంబులో నిరతంబు నీవికకంబుగళ హేరంబజనక దయాంబు ధీశ త్ర్యంబకాభవ॥ రజిత॥

శివుడు రాకడ - అటతాళం.

యిందు శేఖరుడు వచ్చెను సంతసమున॥ యిందు॥ శేఖరుడువచ్చె నంది వాహనమెక్కి బృందారకులు తన ముందర నడువగ॥ యిం॥ ఫణి

భూషణహారుడు సుందరముగ మనసిజమదహారుడు మినువాక దాల్చ మినుశిఖగలవేల్పు మునులు ముప్పదికోట్ల ఘనముగ బొగడాగ॥ యిం॥ సృష్టిలో భద్రాచల స్వామికి ప్రియదృష్టి మూర్తియును చాల అష్టదిక్పాలురు జిష్ణుగజానన విష్ణుబ్రహ్మాదులు వినుతులుచేయగ.

క॥ నందీశ్వర మద్దిమేరుల। క్రిందను మాంధాతవుండె కీర్తి ప్రభావుం। డందిగిరి। మద్దిగూల్చుమా నందముతో నతడు లేచి నరుదెంచుసుమీ॥

వ. అనిన నందీశ్వరుండు మద్ది పెకిలించగానే మాంధాత లేచి యిట్లనియె.

మాంధాతవాక్యం - ఆదితాళం.

వందనములు భక్తవందిత వుమాపతి కందర్పారాతి మునిగణనుత పశుపతి॥ వంద॥ గరగళ అయోధ్యాపురము విడిచిమేము తరుణి తనయుల బాసి తెరగునయితిమిస్వామి॥ అంధకాసురశిక్ష అంతకాంతక శివ యిందు శేఖర సురబృందసేవితభవ॥ సుందరరూప శితికందర భద్రగిరి మందిరప్రియ వర మమ్ముల బ్రోవర॥ వందనములు॥

ద్విపద.

హోకరకంఠుడ హోసదాశివుడా। హోజగదీశ్వర హోజగత్కర్త। హోవిశ్వ నాథుడ హో పరమేశ । హో నందివాహన హో రుద్రవీర । హో రజితగిరివాస హో చంద్రమకుట । నన్ను పాలించుడి పన్నగభూష॥

వాదం - అటతాళం.

పన్నగధరదేవ నన్ను రక్షించను మీరు వచ్చినారు । భూరీశమద్ది మేరులకింద యిన్నాళ్ళు నీవూ వుండినావు॥ నందనులను గట్టి యిందు జేరితి నేను దేవా మహానుభావ। సుతులిరువురు నీ సతినిన్ను గలుసూను రాజా భానుతేజా యీ తీరుగామాకు భూతలమందున నాథవ్రాసె ధాత॥ యవనాశ్వపుత్ర యీ యవనియేలెదవీవు వేగా వినుమిబాగా॥ శంకరనీదయ యింక యెన్నాళ్ళకు నేనూయేలెదాను ధరణీశయిపుడు కుంజరమెచ్చి నిను గొంచుబ్రోవు యేలెదావు॥ క్షితిలో భద్రగిరి శ్రీపతిమిత్రశుచినేత్ర యీశా శ్రీమహేశా॥

వ. ఆ సమయంబున యీశ్వరుఁడు కైలాసంబున కరిగెనంత విమ లాంగి తనమనంబులో నిట్లనియె.



అటతాళం.

భూవరా నేనేమిసేతు హాప్రాణనాథ నన్ను బ్రోవు రాజవార్ధి గం భీరా హాప్రాణనాథ॥ ప॥ విహితమెంతో విన్నవించ హాప్రాణనాథ హేమ హితవేళ విననైతివి హాప్రాణనాథ॥ దినము యేకయుగమునాయె హాప్రాణ నాథ నీ మనములో మరచియున్నావ హాప్రాణనాథ॥ అన్నాహారంబులు బాసి హాప్రాణనాథ నేనున్న యిందు వేంచేయుడీ ప్రాణనాథ॥ ఘన ముగా వరభద్రగిరీశుని హాప్రాణనాథ పాదవనజము లేమారక తలతు హాప్రాణనాథ.

వ. ఆ సమయంబున అయోధ్యాపురంబునం గలజనులు మంత్రితో నిట్లనిరి.

క॥ వినరయ్యా మంత్రిశేఖర । జననాథుడు వెళ్లిపోయె జననాయ కునిఁ । మనమందర మిపుడు కుంజరమును శృంగారంబు జేయ ముదమున దెచ్చుఁ॥

వ. అనిన కుంజరంబును శృంగారించి విడిచిన మాంధాత నెత్తుకొని రాగా మాంధాత తనమనంబున నిట్లనియె.

యేకతాళం.

ఎంచవశముగానట్టిపురము కమలోద్భవుడు నిర్మించిచూడగ బలుసుం దరము చంచలాక్షులేతెంచెదరు నను గాంచెదము నియమించు మోదమున

మంచిగ శృంగారించికరిని అంపించినారు ననుగొంచువచ్చె భళి॥ ఆటపాటలు యెంతోసొంపు చాలగానుమదికి వేటగగంటికెనులకింపు ఘోటకకుంజర హాట కరథములు మేటిశూరులొకచోటగణము లేర్పాటుగాను బల్ కోటలు యీభువిసాటిలేదు యెచ్చోటదీనికిక॥ వీర్లుచనుదెంచిరి వెయ్యార్లు దేశ దేశములశూర్లు నికురుంబముతో బహుతీర్లుచేర్లు దండికోనేర్లు గలవు బజార్లు ముత్యములహార్లు వేశ్యసుందర్లు యెంతోపదిమార్లుచూచిన॥ వాడ వాడన యెంతో వింతచోద్యంబుగాను జోడుజోడున మేడలింతచూడ ఆర్యులు పువ్వు బోణులెల్ల జతగూడి ఆరతులుపీడక చంకలవేడుక బట్టుగనేడువచ్చె మన రేడుయంచు బల్ చూడవచ్చిరిగ॥ భూరి భద్రాద్రిశ్రీరాముల అనవరతంబు కోరి నుతియింతు మదిలోచాల చారుస్వర్గమును మీరు మంత్రులోవీరు సుందరములవారు బృందముల తీరువచ్చుచున్నారు భాస్కరుని మీరు కాంతి గలవారు యిందులో॥

గీ॥ మంత్రులాదిగజనములు వింతగాను । సకల సన్నాహములతోడ సంతసమున। రాజునెదురంగ వచ్చియురమ్యముగను। రాజ్యమును మరలగట్టిరి పూజ్యముగను॥

అటతాళం.

దిట్టముతోడుతను మాంధాతకుగట్టిరి రాజ్యమును పట్టణాధిపుడై నట్టి మాంధాతపై చుట్టుచామరములు బట్టివీవగాను॥ ది॥ సంగీతములు పాడగ సజ్జనులంత సరసుడనుచు వేడగ అంగుగాను భూసురాంగనలందరు మంగళారతులివ్వ శృంగారముగ నపుడు॥ ది॥ వరభద్రగిరివాసుని చిత్తము లోన స్మరణజేయుచునుపూని ధరణిబృందారక వరులదీవనగొని ధరణిలో నయోధ్యపురము యేలుచుండె॥ ది॥

వ. ఆసమయంబున వైశ్యుడు విమలాంగితో నిట్లనియె.

క॥ భామామణివినవేనవ । భూమీశు డయోధ్యయనేడి పురముకు వచ్చెన్ । నేమెంచకనను గూడవే। ప్రేమతొ నవసరుకు గొంచుబోదము వేడ్కన్॥

విమలాంగి వాక్యం.

క॥ యీమూర్ఖ మంతపిడువుము । కామాంధుడ. కొత్తసరుకు గద లించుమికన్ । భూమీశుని కడ కేగద । మీమహిభద్రాద్రిలక్ష్మి యీశుని నమ్మా॥

పాదం - చౌకం.

నారీమణి మదవారణగమనా కూరిమితో నన్ను గూడుముచాన॥ అన్నవు నీ పనియున్నను నమ్మినన్నిటులను టన్యాయముసుమ్మి॥ సొగసగు మగువల నగుమొగములు నిగనిగదేహము వగబిగితోను కామక్రోధము గప్పియుచాల పామరపలుకులు బలికెదవేలా॥ మదినిల్వాడు వినుమదన కఠారి ముదముతో చిలుకలపలుకు విఠారి॥ పతివ్రతనుర నేను పణతులలోను మతిహీనుడ వీక్షితిలోపలను॥ సోమునిబోలిన మోముగుకొమ్మ కాముని కేళికి గలియగరమ్మ దోషమువచ్చు నీభాషలుమాను. భాసురభద్రాచలే శుడు బ్రోచుర్॥

వ. విమలాంగిని పల్లకిలో నెక్కించుకొని వైశ్యుడు తిర్లెనపుడు విమలాంగి తనమదిలో నిట్లనియె.

అటతాళం.

పాలించరానన్ను పాపవిమోచన శ్రీలక్ష్మిలోలసర్వేశా శ్రీమన్ నారాయణ॥ ప॥ ఆపదుద్ధారక దాపునీవెమాకు పాతకహారిబిరుదునీదే శ్రీమన్ నారాయణా॥ భర్తలేని స్త్రీలువ్యర్థ మాయిలయందు భర్తను గలుపుము దేవా శ్రీమన్ నారాయణ॥ కరుణాసాగర భక్తవరదాగిరిజార్చిత వురగశయన హృషీకేశా శ్రీమన్ నారాయణ॥ సింధుదయాళ వసుదరభద్రాద్రి మందిర హరిస్వర్ణచేలా శ్రీమన్ నారాయణా॥

వ. అయోధ్యపురంబు జేరినంత గని మంత్రి రాజుతో నిట్లనియె.

క॥ జననాథ వినుమిప్పుడు । ఘనమయిన సరుకుగొంచు కడుమోద మునన్ । చనుదెంచెవయిశ్య డొక్కడు । దినకరవంశాబ్ధిచంద్ర గీరుల్ వినుడీ॥

రాజువాక్యం.

గీ॥ మంత్రిశేఖర యట్టికోమటికి నీవు । విందుగావించు నీయింట యిపుడు వేగ।అతనితోడుత బేరంబు లాడుదాము । వేగిరంబున జేయించు వేడ్కతోడ॥

వ. అనిన వైశ్యునితో ప్రధాని శేఖరుం డిట్లనియె.

ప్రధానివాక్యం.

గీ॥ మనుజనాథుడుమీకు మాయింటవిందు । జేసినను బంపెతరలుడీ శీఘ్రముగను । భోజనము జేసి పోవయ్య సహజముగను । రాజునిన్నెదిరి చూచును రమ్ము వేగా॥

## వైశ్యునివాక్యం.

క॥ వినరయ్య మంత్రిశేఖర । ఘనమైన సరకులన్ని గలవిందులనున్। చనుదెంచు చెటుల విందుకు । జననాథుని తోడునాడు సరళిన్ దెలుపు॥

గీ॥ వినుముకోమటి శ్రేష్ఠమాకిద్దరధిక బలులురణశూరులు సుతులు ధర్మబ్రహ్మనయిన । గెలిచెవారలు బలుధీరులు గలరుయిందు వుంచెదను నీవు సందేహ ముంచవలదు॥

క॥ అటువంటి శూరులెప్పుడో । తటకునరప్పించరయ్య తనయులు మీరల్ । యెటువంటి బలవంతులైనా॥

వ. అనిన రాచకొమారులం దోడ్కొనివచ్చినం గని వైశ్యుం డిట్లనియె.

### ఉత్పలమాలిక.

భూరిపరాక్రములార ఘన భుజబలశూరులు యెందరైనబల్।చోరులు వచ్చినన్ ముఖముచూడక మీరలుద్రుంచివేయుడీ। మీరుభయంబు జెందకను మిక్కిలి జాగ్రతతోడ వుండుడీ। కూరిమితోడ మీరుయిట కూర్పక యుండుడు ధీరవర్యులై॥

వ. అని వైశ్యుండు విందు జేసెనంత నా బాలకులు రాత్రివెళ్లునా యని బహుజాగ్రతగా వుండిరంత.

## అన్నదమ్ముల వాక్యం.

### అటతాళం.

అన్నవినవయ్య తిన్నగనాకు॥ విన్నవించెను నొక్కకథ యిపుడు మన్నన తోడను॥ చిన్నితమ్ముడ యేమిదెల్పుదునీకు॥ యిట్లున్నది మన బ్రతుకు కథవినవే విన్నవించెద నిప్పుడు॥ నమ్మివుంచెను వైశ్యుడిచ్చోటను కమ్ముకొని బలువచ్చె నిద్రనాకన్నులకు వినుమిప్పుడు॥ మంత్రవుదకాము మనతాతద్రావెను అంతలోపల గర్భముననుండియవతరించెను తండ్రిరా॥ ఆయనవార్తేమి అన్నయ్యశీఘ్రము దయతో జెప్పుడునాకు మాంధాత చరితంబును - లెక్కలేకుండ సూర్యునిపైతాను - నిక్కముగ దండెత్తి తాముక్కంటిని కోపించెరా - ఇంకయేలాగు మనతండ్రిచేసెనూ యింక పంకజాక్షుడు మనలబ్రోచును బాగుగ నీవేళను యింద్రునితోడ యుద్ధంబు చేసియు చంద్రశేఖరుతోడ వరమును - జెందె మోదముతోడనూ॥ జననీ జనకుల యెడబాసి యింద్రుండు మనకుద్రావెను బ్రహ్మదేవుడు మనుజనాయక యిట్టులా॥ ధరణియందున భద్రాచలేశుడు కరుణతోడుత లక్ష్మణాఖ్యునిగాచె ఘనకృపతోడనూ॥

### సీసార్ధములు.

తమ్ముఁడ వినరోరి ధరణీతలంబెల్ల యేమిశంకయులేక యేలుచుండె। సామంతులును మంత్రి భంగమెల్లనుగొల్వ సభలోనమనతండ్రిసంతసమున। యేకచక్రంబుగా యేలితిజగమంత యెవ్వఁడు నాసాటిధీరుఁడు॥ యనిపల్కెతాను - భువనమందున శూరుఁడు। రవినినోడించె నేవాసవునితో పోరుసల్పి। భవుని వెఱపించివరములనడసితినంచుతాను॥ మనుజేంద్రుఁడిట్లు నామంత్రిజాలంబెల్ల విధిమాయ దండిదని విన్నవింప। మంత్రుల కోపించియు పొగడింపించె। విధివేగయే తెంచె విప్రవేషంబున ముదముతో జూదమాడియు। పోయెదననిపల్కె। నదరక బెదరకాడియు। విధికిరాజ్యంబు నోడి మదిలోన ముదముబాసి। ముదితను మనలగూడి విధమున బయలువెళ్ళె॥ నడవిలో నతికష్ట మనుభవించగమనమరుదెంచగను మనఅమ్మ మొదుయేగెనో తండ్రి బాగుగా తరువుకు। గట్టియు యేరులో గలసిపోయె। కోమటిఅన్నయ్య కొన్నాళ్లు పెంచెను ప్రేమతోమనయీమంత్రియు। పెంచుచున్నాఁడు యేమితెల్పుదు వింతయు। భూమిలో భద్రగిరిధాముడే బ్రోచుసుమ్మి। కోమలగాత్రవినరా నాముద్దు తమ్ముఁడాబల్॥

వ. విమలాంగి తనమది నిట్లనియె.

గీ॥ నాదుపుత్రులు వీరు యీమేదినందు। ముందునే నోమినట్టి ఫలమందెనిందు। సుతులపొడగంటి పలుకులుచెవినివింటి। భద్రగిరివాస వేగ నారతినిగూర్చు॥

### అటతాళం.

శ్రీభద్రగిరివాస కేశవమందార - నాభ క్తసన్ను యెన్నటికిగలుగునో స్వామీ॥ యిభరాజవరదా నావిభుడోయీ పురరాజ రభసముతోగూర్చు విబుధవల్లభమిత్ర॥ సుతులిరువురు లక్ష్మీపతినన్ను గలిసిరి-పతితపావననన్ను పాలించదొరనీవే॥ మరకతనీలాలు మణులు కొన్నియుదీసి మరుగునదాచెద నరవరనిను దెల్ప॥

వ. యిట్లనుచుండ తెల్లవారె నంత వైశ్యుం డేగుదెంచిన బాలకులు మంత్రిగృహంబుచేరి యుండిరక్కడ వైశ్యునితో విమలాంగి యిట్లనియె.

### విమలాంగివాక్యం.

గీ॥ అన్న యెక్కడివారల అంపినారో। యెన్నగల సరుకులన్ని వారెత్తుకొనిరి। జనిరి మనమిపుడు బోయి యీజనవరునకు। విన్నవింతము తరలుడీ వేగిరమున॥

వ. అనిన వైశ్యుండు విమలాంగిని దోడ్కొనిపోయి తెరచాటున నుంచి రాజుతో నిట్లనియె.

క॥ వినుమేలిక మంత్రిబాలుర । ఘనమయిన సరుకులన్ని గని తెచ్చిరిటుల్ । జననాథ వాండ్రతో యీ । వనజాక్షియు నడుగుసుమ్మి వసుధాధీశా॥

వ. అనిన బాలకుల రప్పించి ప్రధానితో పృథివీశ్వరుం డిట్లనియె.

వాదం - ఆదితాళం.

ధీరాగుణవంత మంత్రివీరా పారావార గంభీరా భండనాహిత సంహారా లేరుర నీసరివారు వసుంధర కూరిమి నాయె - నాకొడుకుల దెస్తివి॥ రాజవీరు భాస్కరతేజా నీసుతులూ కల్పభూజ మోదమాయె మహారాజ రాజకీర్తి విభ్రాజితమొప్పగ భూజనపోషక భూరిపరాక్రమ॥ గోరువద్దనగట్టితిని వీరునీకెట్టు లగుపడినారు నీమదినున్నట్టిగోరు - వేరు చేయ సువిచార నీకు నేధారునైనైన ధనధాన్యంబయిన॥ నేనువైశ్యుని వ్యర్థుండగాను తెచ్చియు పెంచినాను ఆజ్ఞచే తెచ్చినాను క్షోణినాథ నీసూను లిద్దరిని భానుకులనీవూ బాసితివెందుకూ॥ వేడిమితోడ జూద మాడి యేను రాజ్యంబునోడి తరుణి తనయులగూడి॥ వేడుకబాసియు విపినభూములా వాడు చరించగ నన్ను బాసిరిల॥ భూరి వరభద్రాచల శ్రీహరి కృపతోడమీరు నారిగలును మీసరిదొరలేరి వారిజాక్షు గిరిధీర శత్రుసంహారా మరమందార సరార్చిత॥ రాజా॥

విమలాంగి వాక్యం.

గీ॥ ధరణినాయక వీరు నాతనయులయ్య । నీవునాభర్త రాజేంద్ర నిజముసుమ్మి । నన్ను యేలుము సభమెచ్చనన్నగాను । ఆపదలుదీరె యీ వేళ పాపదూరా॥

వాదం - అటతాళం.

సుందరిసభజను లందరునవ్వెదరు మందగమనసిను ముందెబాసితి చెలి॥ సరవరసభజను లురుముదమొందెదరు సుగుణశీల విధివశమున కిట్టు లాయె॥ ముద్దియనీవు వైశ్యునొద్దనుండితివిగ వద్దుపో అపకీర్తివచ్చురా కేం దుముఖి॥ కాంచనచేల భావించితిసఖుడని చంచలనేత్ర నిజమెంచిచూడుము దొర॥ ఒప్పదు నాదుమదితప్పక వసుంధర జెప్పవెసాక్షి యేదిపుడు భామా మణి॥ అగ్నిగుండముజేయు డందున జొచ్చెదను సుజ్ఞానవంతులంతచూచి సంతోషించగ॥ చెలియా ఆవిధమెచేయింతు మోదమున యిలకీర్తివచ్చు

చంద్రాదులు భాసిల్లుతారలు-దానవాగస్త్రీలు చానలలోన పేరంటములు-మరి పెండ్లిపాటకూట కూరిమితోడ - తుంబురునారదులు పంచాంగమును జెప్ప- బ్రహ్మదేవుండు చంచలాక్షుని బొగడ-చండికేశ్వరుడు పరగపార్వతి లక్ష్మి - భారతీదేవిఅరుంధతి మొదలైన అతివలతోడ-మరల పెండ్లియాయెమ మనుజేశ్వరునకు॥

## మంగళహారతి.

మంగళారతి యిదిగో శ్రీరామ॥ మం॥ మంగళారతి భుజంగశయన - భవభంగఖగపతి యంగరామజయ॥ మం॥ సారసాక్ష సువిచారసుజనమందార మానిసంచారవీరజయ॥ మం॥ భీమతేజఘనశ్యామగాత్ర రవిసోమనేత్ర సుత్రామవినుతజయ॥ మం॥ భాసురభద్రగిరీశశౌరిహరి - కేశవలక్ష్మణ దాసపోషజయమంగళం॥

గీ॥ లాలిభద్రాద్రి వాసశ్రీలాలిలాలి। లాలిశంకరవందిత లాలిలాలి। లాలి శ్రీలక్ష్మిహృదయేశ లాలిలాలి। లాలిరఘురామునివినుత లాలిలాలీ॥

క॥ జోజోరవికులదీపక।జోజోసోమార్క నేత్ర జోరఘురామా। జో జో వైకుంఠేశ్వర। జోజోభద్రాద్రివాస జోలక్ష్మీశా॥

క॥ యీమాంధాత చరిత్రము। యేమానవుడైన గాని యీయిల యందున్। ప్రేమతో చదివిన వ్రాసిన। సామజవరదుండు సౌఖ్యసంపద లిచ్చున్॥

మాంధాతచరిత్రము - యక్షగానము.

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి. 1934.